# సనాతన సారథి

సత్య ధర్మ శాంతి ప్రేమలద్వారా మానవజాతి సామాజిక నైతిక ఆధ్యాత్మిక అభివృద్ధికి అర్పితము:

సంపుటము 34 | జూన్ 1991 | సంచిక 6

....విషయసూచిక





సంవత్సర చందా : తెలుగు లేక ఇంగ్లీష్ :

ఇండియా : రూ. 20/-, ఓవర్సీస్ : ఎయిర్ మెయిల్ రూ 140/-

సీ మెయిల్ రూ. 70/- U. S. $ 4.5, £ 2.5 U. S. $ 9, £ 5.00

ఆంధ్రప్రదేశ్, అనంతపురం జిల్లా, ప్రశాంతినిలయంలోని శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్ ప్రెస్సులో ప్రమోద్ కుమార్ సూరిచే " శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్ ట్రస్టు " తరపున ముద్రింపబడి, ప్రచురింపబడినది. సంపాదకుడు : వి. కె. నరసింహన్.

# జననీ జన్మభూమిశ్చ...

" ప్రపంచములో మానవుడు సకలవిద్యలు నేర్చుకొని, సభను జయింపవచ్చును. పరిపూర్ణ బలాఢ్యుడై రణరంగమున యుద్ధము చేయవచ్చును. రాజరాజైపుట్టి రాజ్యమును పరిపాలింపవచ్చును. గోదాన, హిరణ్యదానములు చేయవచ్చును. అవసరమైనచో, ఆకాశమందున్న నక్షత్రముల లెక్కను తెలిసికొనవచ్చును. సమస్త జీవరాసుల పేర్లను సులభముగా చెప్పవచ్చును. అష్టాంగ విద్యలను నేర్చుకోవచ్చును. సాహసకృత్యాలతో 'చంద్రమండల' మైన చేరవచ్చును. కాని, మానవుడు తాను దేహేంద్రియములను అరికట్టుకొని, మనస్సును నిలకడగా నిల్పుకొని, అంతర్ముఖియై నిశ్చల, నిస్స్వార్థ హృదయుడై నిలువగలడా? "

ప్రేమస్వరూపులైన విద్యార్థులారా!
విద్యాబోధకులారా! విద్యాభిమానులారా!

ఇది నవీననాగరికత యుగం. సాంకేతిక విజ్ఞానశాస్త్రము విలసిల్లునట్టి కాలం. ఒకవైపున ప్లాస్టిక్, ఎలక్ట్రానిక్ మరియు కంప్యూటర్ల ద్వారా అణుశక్తికి సంబంధించిన రంగమునందు, అంతరిక్షమునకు సంబంధించిన రంగమునందు శాస్త్రజ్ఞులు ఆశ్చర్యకరమైన అభివృద్ధిని నెలకొల్పుచున్నారు. ఇంతేకాక, నేడు కృత్రిమమైన గ్రహములను తయారుచేసి గగనమార్గమునకు పంపుతున్నారు. అణుశక్తి పరిశోధనచేత అనంతమైన కాలమును, కర్మమును, ధనమును వ్యయం చేస్తున్నాడు. కానీ ఈ పరిశోధనకు సంబంధించిన, తగిన పరిశీలన ఏమాత్రమూ కనిపించుటలేదు. ఒకరికి మించి మరొకరు అభివృద్ధి చెందవలెనని, నీతినిజాయితీలను విస్మరించి, తమ స్వార్థ, స్వప్రయోజనముల నిమిత్తమై అనేక విధములుగా పాటుపడుచున్నారు.

ఒకవైపున విజ్ఞానశాస్త్రము విరివిగా పెరిగిపోవుచున్నది, రెండవ వైపున నైతిక, ధార్మిక, ఆధ్యాత్మికములలో మానవత్వం అతి

ఘోరంగా క్షీణించి పోవుచున్నది. ఈనాడు మానవునకు కావలసినది పవిత్ర హృదయులైన బాలబాలికలు కావాలి. నిస్స్వార్థ హృదయులు కావాలి. దేశమునకు తమ జీవితమును త్యాగం చేసే వీరులు కావాలి. కానీ దురదృష్టవశాత్తు ఈనాటి మానవుడు ధన కనక, వస్తు, వాహనాదులచేత సుఖశాంతులు పొందగలడని భావిస్తున్నాడు, భ్రమిస్తున్నాడు. నిజముగా ధన, కనక, వస్తు, వాహనాదులందు సుఖశాంతులు ఏమాత్రము లేవు. ఒకవేళ సుఖము అనిపించినా, తాత్కాలికమైన సుఖమును అందియ్యవచ్చునేమోకాని, నిజమైన సుఖము బయట పరిస్థితియందుగాని, బయట వస్తువులయందుగానీ మనకు కానరాదు.

## మానవతా విలువ

ప్రాచీనకాలము నుండి భారతదేశమునందు రారాజులంతా యతిరాజులను ఆశ్రయించి, వారిద్వారా శాంతిభద్రతలను అందుకోగలుగుతూ వచ్చారు. కేవలం మానవునకు ప్రధానమైన శాంతి ఆత్మజ్ఞానమునందు మాత్రమే లభించునేగాని, అన్యమార్గములందు లభ్యము కాదు. ఈనాటి మానవుని మనస్సు నైతిక, ధార్మికములందు ఇంత ఘోరముగా క్షీణించటానికి కారణము ఏమిటో విద్యార్థులు గుర్తించుట అత్యవసరము. శీలరహితమైన విద్యవల్ల, మానవత్వములేని భౌతిక విజ్ఞానము వల్ల, నీతి లేని వ్యాపారమువల్ల, నిజములేని రాజకీయ తంత్రమువల్ల ప్రపంచము అనేక విధములైన కష్టములకు, నష్టములకు గురౌతూవచ్చింది. ఈనాటి మానవత్వములో తరిగిపోయిన దివ్యత్వాన్ని విద్యార్థులు పునరుద్ధరింపచేయాలి. విద్యార్థులయందు జాతీయతాభావం అభివృద్ధి చెందాలి. ఈనాటి విద్య కేవలము తెలివితేటలను మాత్రమే పెంచుచున్నది కాని, సద్గుణములను ఏమాత్రము అభివృద్ధి గావించుట లేదు. ఈనాటి విద్యార్థి మస్తకమును పుస్తకము వలె మార్చుకోగలుగుతున్నాడేగాని, నిత్యజీవితమునందు మానవతా విలువలను ఏమాత్రము పెంచుకోవటం లేదు. నిత్యజీవితములో సత్యమార్గమును గుర్తించి తగినటువంటి ఆచరణలో పెట్టాలి.

పాపభీతిలేని హేతువుచేత, దైవప్రీతిలేని బుద్ధిచేత మానవులందు నేడు మానవత్వం అనేది పూర్తిగా అణగారిపోయినది. ఈ కారణములచేత నేడు 'విశ్వశాంతి' కిదే విప్లవం. ఈనాటి మానవుడు పాపభీతి, దైవప్రీతి, సంఘనీతి— ఈ మూడింటినే ముఖ్యంగా హృదయములో నింపుకోవాలి. నేటి విద్యలు కేవలం తెలివితేటలను మాత్రమే పెంచగల్గుచున్నవే కాని, ఏ కొంచెమైనను సద్గుణంబులు పెంచుట లేదు. కోటివిషయములు తెలిసికొని యుండినప్పటికిని, ఒక్క సద్గుణం లేకపోయినచో ఫలమేమి యుండును? కనుక, ఈనాటి మానవునకు ప్రధానమైనది మానవతావిలువ. నేడు నీతి, నియమాలతోకూడిన నేతలు కావాలి. ఈనాడు ప్రచారప్రబోధలు ఆచరణలో కనిపించాలి.

## జీవితలక్ష్యం

ఈనాటి మానవ జీవితము అమితవ్యయముతో కూడివుంటున్నది. ఈనాడు సాంకేతిక విజ్ఞానశాస్త్రం విరివిగా పెరిగిపోయినది. దీనివల్ల ఈనాటి సమస్యలు మనకు ఏమాత్రము తీరవు.

మానవుని సమస్యలు తీరవలెనన్న మానవుని ద్వారానే తీరవలెను. మానవుని ప్రవర్తన ద్వారానే ఈ సమస్యలు తీరిపోవాలి. మానవుడు మానవుడుగా జీవించాలి, మానవత్వమును అభివృద్ధి గావించుకోవాలి. విద్యలన్నీ కేవలము ఉద్యోగ నిమిత్తమై ఆచరించేవిగా మీరు భ్రమిస్తున్నారు. ఉద్యోగమునకు విద్యకు ఉండిన సన్నిహిత సంబంధ బాంధవ్యమును త్రుంచివెయ్యాలి. Education should be for life not for living. జీవించటము ప్రధానము కాదు. మనము జీవితలక్ష్యాన్ని గుర్తించాలి. జీవితమంటే ఏమిటో ఎవ్వరూ ప్రబోధించుట లేదు. మానవజీవితము చాలా పవిత్రమైనది, దివ్యమైనది. ఇట్టి మానవత్వాన్ని మనం విస్మరించి భౌతికమైన, లౌకికమైన పాంచభౌతిక సుఖముల నిమిత్తమై అనేక విధములుగా మనం ప్రాకులాడుతున్నాము. మనకు భౌతికమైన అనుకూలములు అవసరమే కాని, జీవితమంతా దానికే అర్పించరాదు.

### మానవుడు క్షీణించిపోయినా ఆశయాలు మరణించవు

ప్రపంచములోని సమస్త వస్తువులు ఒకానొక కాలములో మార్పు చెందుచున్నవి. ప్రతి మానవుడు ఒకానొక కాలములోపల క్షీణించిపోతున్నాడు. మానవుడు మరణించినప్పటికిని మానవుని ఆశయాలు మరణించవు. అవి చిరంజీవిగానే ఉంటాయి. కనుక మనము ఆదర్శ జీవితమును అనుభవించాలి, ఆశయాలను అభివృద్ధి పరచుకోవాలి. అదియే అమరత్వమైనది, అదియే అమృతమైనది. ఇట్టి ఆశయాలను ఈనాడు జగత్తునకు వ్యాపింపచేయాలి. ప్రాచీనకాలము నుండి మన భారతదేశము అనంతమైన ఆత్మబోధలు సల్పుతునేవస్తున్నది. మీ జీవితమును దేశమునకు అంకితం గావించుకొనేటటువంటి భావముతో మీ హృదయమును నింపుకోవాలి. కేవలము స్వార్థము సరియైనది కాదు. "Fish is better than selfish". మానవుడు కేవలము స్వార్థములోనే మునిగి జగత్తులో సంచారంచేస్తూ, జగత్తులో ఉండిన దుర్గుణములను, దురాచారములను, దురహంకారములను ఏమాత్రము రూపుమాపు చేయలేకపోతున్నాడు. ప్రేమను పెంచుకోవాలి. విశాలమైన మనస్సు అభివృద్ధిగావించుకోవాలి.

### క్వాంటిటీ కాదు - క్వాలిటీ కావాలి

ఈనాడు ఎక్కడ విద్యాసంస్థలు అధికంగా పెరుగుచున్నవో, ఎక్కడ న్యాయశాస్త్రములు అధికంగా పెరుగుచున్నవో అక్కడనే అవిద్యలు, అన్యాయాలు, అక్రమాలు, అనాచారాలు—అధికంగా పెరిగిపోవుచున్నాయి. ఏ విద్యాసంస్థలు, ఏ న్యాయస్థానములు లేనట్టి కారడవుల యందు, పల్లెలయందు సహజజీవితాన్ని అంతో ఇంతో అక్కడ మానవులు గడుపుచున్నారు ఈనాడు దేశమంతా ఇంతగా దిగజారిపోవటానికి కారణమేమిటి? విద్యాధికుల యందు మితిమీరిన ఆశలు పెరిగిపోవుచున్నవి. మన మనోశాంతి మనయందే ఉంటున్నది కాని, బయట ప్రపంచములో ఎక్కడా లేదు. ఉండదు. ఎన్ని చదువులు చదివినా, ఏమి ప్రయోజనం? "ఎన్ని చదువులు చదివినా లాభం లేదు. అతని ఫాలభాగమందు వ్రాయబడిన 'వ్రాత' తప్పించుటకు ఎవరి తరంకాదు. చెడ్డబుద్ధులు అతని మెదడులో ప్రవేశించె

నేని, మంచి బుద్ధులన్నియు ఎండబారును-బెండుబారును ". ఈనాటి మానవుని ప్రతి ఒక్క అడుగు అధర్మములో పడుతోంది, ప్రతి పలుకులోను సత్యం సడలిపోవుచున్నది, ప్రతి చూపులోను ప్రేమ క్షీణించి పోతున్నది, ప్రతి ఆశలోపల దూరదృష్టి నశించిపోతున్నది, ప్రతి కోరిక స్వార్థరూపాన్ని ధరిస్తోంది. మానవుని యందు అభ్యుదయ భావాలు అడుగంటిపోతు న్నవి. చైతన్యము చల్లబడిపోతున్నది కుల, మత భేదాలు మారణహోమాలు చేస్తున్నాయి. రాగద్వేషాలు స్వేచ్ఛా విహారములు సల్పుతు న్నాయి. నిజము చెప్పాలనుకొంటే, మానవ త్వమే పూర్తిగా నశించిపోయింది. మనకీనాడు Quality కావాలి, Quantity కాదు.

## సమాజ చింతన

ఈనాటి చదువులన్నీ ప్రపంచములోగల విషయాలను తలలో చేరుస్తున్నాయి. అట్టి చదు వులు చదువులుకాదు, "లోకాస్సమస్తా సుఖినో భవంతు" అందరూ క్షేమంగా ఉన్నప్పుడే, నీకు కూడా క్షేమం. ఈనాటి విద్యావంతులు కేవలం తన వ్యక్తిత్వాన్ని కోల్పోయి, తన కుటుంబాన్ని తన దృష్టిలో పెట్టుకొంటున్నారు కాని, అట్టివారలు తమ మనస్సులో ఏమాత్రం "సమాజ చింతన" చేయటము లేదు. సమాజమే లేకపోతే, మనం ఎక్కడ వుంటాం? మన జీవితమంతా సమాజముతో కట్టబడి యున్నది. సమాజము క్షేమముగా ఉన్నప్పుడే మనకు క్షేమం. పరదూషణ ప్రవేశ పెట్టరాదు, ఎవరిని హాస్యాస్పదం చేయరాదు, పరులను చిన్నపుచ్చరాదు, పరుల దోషములను మనం ఎప్పుడు ఉచ్చరించరాదు. కనుక, నీకు చేత నైతే ఉపకారం చేయి, లేకపోతే ఊరికే కూర్చో. ఊరికే కూర్చుంటివా, నీవు ఉపకారం చేసినట్లే ఇతరులకు అపకారము చేయవద్దు; అదే నీవు చేసే పెద్ద ఉపకారం.

## తల్లిదండ్రులే బాధ్యులు

**విద్యార్థులారా!**

విద్యావిధానంలో అనేక పెడమార్గములు పట్టుటచేతనే, విద్యార్థుల భావాలు పెడమార్గాన్ని అనుసరిస్తున్నాయి. విద్యార్థులు ఏనాడు దుర్మా ర్గులు కాదు. పవిత్ర హృదయులు, నిస్స్వార్థ హృదయులు. ఇంటిలో తల్లిదండ్రులు, విద్యాసం స్థలలో గురువులు పెడమార్గాన్ని పట్టిస్తున్నారు. తల్లిదండ్రులకు ప్రేమ ఉండుట సహజమే, కాని, ఆ ప్రేమ మితిమీరినప్రేమగా ఉండ రాదు. బిడ్డలు ఏవిధముగా పెరుగుచున్నారు? ఏవిధమైన నడతలలోనున్నారు అనేటటువంటి ఆలోచన కల్గి బిడ్డలను చక్కగా Watch చేస్తూ రావాలి. ఈనాటి తల్లిదండ్రులే ఇటువంటి బాధ్యతలను గుర్తింపలేకున్నారు, ఇంక పిల్లల కేమి చెప్పగలరు? పిల్లలను స్వేచ్ఛగా విడిచి పెట్టి, వాళ్లు రాత్రి 12 గంటలకో లేక 2 గం॥ లకో ఇంటికి వచ్చినా వారిని ఏమాత్రమూ ప్రశ్నించుటలేదు. అట్టితల్లిదండ్రులు వారిని ఎంతగానో పాడుచేసుకొంటున్నారు. ఈనాటి విద్యార్థులలో Manners గాని, మంచిప్రవర్తన గాని, క్రమశిక్షణకాని ఏమాత్రము కనిపించుట లేదు. ఇది పిల్లల దోషముకాదు తల్లిదండ్రుల దోషమే. మితిమీరిన ప్రేమను తల్లిదండ్రులు చూపుటచేత, పిల్లలు పెడమార్గమును పట్టుట జరుగుచున్నది. కనుక, తల్లిదండ్రులు కూడ దీనికి కొంత బాధ్యులౌతారు.

## కత్తి దోషం కాదు-కత్తి పట్టిన వ్యక్తి దోషం

విద్యతోబాటు Science and Technology కూడ అవసరమే. Science చెడ్డదికాదు. కాని, దానిని నీవు ఉపయోగించుకొనే విధానములో చెడు మార్గము జరుగుచున్నది. చేతిలో కత్తి వుంటుంది. ఆ కత్తితో పండ్లు కోసుకోవచ్చు, కూరగాయలు కోసుకోవచ్చు. కానీ, ఆ కత్తితో ఇంకొకరి గొంతునుకూడ కోయవచ్చు. అది కత్తిదోషముకాదు, ఆ దోషము కత్తి పట్టిన వ్యక్తి దోషము. Science అలాంటిదే. కనుక ఈనాడు ఆధ్యాత్మికము లేకపోతే సైన్సు గ్రుడ్డిది. అందుచేత, సైన్సు మరియు అధ్యాత్మికము- ఈ రెండింటి యొక్క ఏకత్వాన్ని Negative Positive మాదిరి చేర్చాలి. ఈనాటి సైంటిస్టు లందరు అన్నీ తెలుసుకోవటానికి ప్రయత్నిస్తు న్నారు, కాని తనను- తాను తెలుసుకోవటా నికి ప్రయత్నము చేయుటలేదు. అన్నింటిని వశము చేసుకోవటానికి ప్రయత్నిస్తున్నారు. కాని, తన Senses తాను Control చేయటా నికి ప్రయత్నించుట లేదు.

## నీ మాతృదేశమునకు సేవ చేయి

విద్యార్థులారా! మీరు విద్యావంతులై చక్కని ఆదర్శముతో ప్రపంచములోనికి వెళ్లి అన్ని రంగములందు మీ ఆదర్శములు ప్రతి ష్ఠించాలి. కేవలము డిగ్రీ నిమిత్తమై మీరు చదువనక్కరలేదు. కేవలం మన హృదయతృప్తి కోసం చెయ్యాలి. "విద్య డిగ్రీ లకొరకను వెట్టివీడి, సేవా వృత్తికై మీరు జంక బోక ప్రాకృతమైన సేవలను మీరు సల్ప వలయు" దేశసేవ చెయ్యాలిగానీ ఏ ఇంజ నీరింగో, ఏ మెడికలో, ఏ విధమైన సైంస్సో పాసై ఏ ఇరాన్ లేక అమెరికా, జర్మనీ, జపాన్ ఎక్కడకో బయలుదేరి పోవ టం ఇది చాలా దేశద్రోహం. పుట్టి, పెరిగి మిమ్మల్ని అభివృద్ధి గావించిన భారతదేశము నకు సేవచెయ్యాలి. ఏ దేశమువారు ఆ దేశము నకు సేవ చెయ్యాలి. కన్నతల్లిని వదలి, ఎవరినో మన తల్లి అని ఆశ్రయించుట ధర్మ మందురా? "జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి" మన జన్మభూమికి మన మాతృదేశ మునకు మనము సరియైన ఆదర్శమునందిం చాలి. ఈ చదువుతున్న పిల్లలందరూ విదేశా లకుపోతుంటే భారతదేశము యొక్క పరిస్థితి ఏమిటి? అక్కడికిపోయి మీరు లక్షలు సంపా యించేకంటే ఇక్కడ మీరు వందలు సంపా యించండి అదే శాంతి. అదే మీయొక్క నీతి. Money Comes and Goes (ధనము వస్తుంది పోతుంది); కాని, Morality Comes and Grows (నీతి వస్తుంది అది పెరుగుతుంది). నీతిని మీరు పెంచుకోవాలి.

## మనస్సే మూలం

మన దేశాభిమానమే మనకు లేకపోతే, దేహాభిమానము ఎట్లా వస్తుంది? దేహము - దేశము రెండు బింబ ప్రతిబింబములు. మనం ఏ దేశమునకుపోయి బిక్షము ఎత్తనక్కరలేదు. భారతదేశములో లేనిది, ఇంక ఏ దేశములో కూడా లేదు. కేవలము దేశాభిమానం దురభి మానం కాదు. ఉన్న సత్యమది. ప్రాచీనకాలం నుండి అన్ని విద్యల యందు అభివృద్ధి గాంచి నట్టిది భారతదేశమే. కానీ ఏనుగెట్లు తన బల మెరుగలేదో, అట్లైనారు నేడు భారతీయులు.

విదేశముల ఆకర్షణలకు మనంబానిస లైపోయి, మన నిజమైనశక్తిని మనము కోల్పో తున్నాము. ఈ సైన్సు అనేది బాహ్య దృష్టి, అధ్యాత్మికము కేవలం అంతర్‌దృష్టి. "పశ్య తీతిపశుః". బయటదృష్టి వలన ఏమి ప్రయో జనము? ఇది కేవలము ప్రాకృత సంబంధ మైనది. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాదు లతో కూడినది. అంతర్‌దృష్టిని పెంచుకోవాలి. మన బంధమునకు, మోక్షమునకు అన్నింటికి మనస్సే మూలకారణం.

## హృదయమనేది 'లాక్' - మైండు అనేది 'కీ'

మీ హృదయమే ఒక పెద్ద Lock. అది ఏ Keys తో తెరవటానికి వీలు కాదు. అది చాలా భద్రమైనది. మన మైండు దీనికి Key. ఈ మైండు అనే Key ని హృదయ మనే Lock లో పెట్టి Right Side Turn చేస్తే, Open అవుతుంది, Left Side Turnచేస్తే, Lock అవుతుంది. అదే విధముగనే మనము ప్రపం చము వైపునకు Turn చేస్తే, Attachment అనగా బంధన, దివ్యత్వము వైపునకు Turn చేస్తే, ఇది Detachment. కనుక Attachment, Detachment లకు మన Turning Difference. Same Lock and Same Key మనము Out look లో పోతున్నాము కాబట్టి అంతా బంధన లో పడిపోతున్నాము. అంతర్దృష్టిని మనము అభివృద్ధి చేసుకోవాలి. ఇదే నిజమైన చదువు. ఈ చదువుతోబాటు మనకు ఈ లౌకిక విద్య అవసరమే. ఈ చదువులు చదువకూడదని చెప్పుటలేదు. ఏది చేసినప్పటికిని, నీవు శ్రద్ధగా చెయ్యాలి. ప్రతీ పని ప్రేమతో చెయ్యాలి. "నా కిష్టమైన పని మాత్రం ప్రేమతో చేస్తున్నా నంటే" ఇది సరియైన సమాధానము కాదు, సరియైన పని కాదు. ఏ పని చేసినా శ్రద్ధగా చెయ్యాలి. ఏ పని చేసినా ఒక సాధన క్రింద, దైవార్పితము క్రింద చెయ్యాలి.

విద్యార్థులారా! మీరు పుట్టినందుకు, విద్యనభ్యసించినందుకు, భారతదేశములో జీవించినందుకు తల్లిదండ్రులకు సత్కీర్తిని తెప్పించండి. మన భారతీయ సంస్కృతియందు "మాతృదేవో భవ, పితృదేవో భవ, ఆచార్యదేవో భవ, అతిథిదేవో భవ" అనేటటువంటి ప్రధాన ములైన సాంప్రదాయములుంటున్నాయి. నీ వెంతటి గొప్పవాడవైనప్పటికి, మరి నీవెంతటి Prime Minister గా మారినప్పటికిని నీ తల్లికి నీవు కుమారుడవే. కనుక మొట్టమొదట తల్లిని గౌరవించాలి, అటుపిమ్మట తండ్రిని గౌరవిం చాలి. తల్లిదండ్రులను గౌరవించలేని వ్యక్తిని, ఇంక లోకము ఏమాత్రము వానిని గౌరవిం చదు. నేడు పిల్లలు తల్లిదండ్రులను చూస్తే ఒక విధమైన స్నేహితులుగా సంచరిస్తున్నారు. ఇటువంటి విషయములను తల్లిదండ్రులు అంగీకరింపకూడదు. ఆ రీతిగా చేసినచో ఆ పిల్లల జీవితమును తల్లిదండ్రులు పాడు చేసినవారు అవుతారు. ఇందుకొక చక్కని ఉదాహరణ కలదు.

## ప్రేమ్‌చంద్ కుమారుల ప్రవర్తన

ప్రేమ్‌చంద్ అనే వ్యక్తి ఒక గొప్ప మహాకవి. అతని జీవిత చరిత్ర చక్కని అద ర్శములతో కూడి ఉంటుంది. అతనికి ఇద్దరు కుమారులుండేవారు. ఆ పిల్లలిద్దరూ అలహా బాదులో చదువుచుండేవారు. ప్రేమ్‌చంద్

అతని భార్య ఇద్దరు కలసి నైనిటాల్‌కు ప్రయాణమై పోతున్నారు. వారి ప్రయాణము నకు ముందుగా తమ పిల్లలిద్దరినీ "మీరిద్దరు స్టేషన్‌కు వచ్చి మమ్మల్ని చూడవలసింది." అని జాబు వ్రాసినాడు. ఆ జాబు అందుకొని, ఆ పిల్లలిద్దరూ స్టేషన్‌కు వచ్చారు. పెద్ద కుమారుడు తల్లిదండ్రులను చూడగానే "అమ్మా! నమస్కారము, నాయనా! నమస్కారము" అని రెండు చేతులు జోడించుకొని నమస్కరించినాడు. రెండవ కుమారుడు మాత్రము రెండు చేతులు రెండు జేబులలో పెట్టుకొని, How are you Mummy? How are you Daddy? అని ఈ విధంగా తల్లిదండ్రులను పలకరించినాడు. రెండవ పిల్లవాడు మాత్రము తల్లిదండ్రులకు నమస్కారము కాని, గౌరవము కాని చూపించలేదు. ప్రేమ్‌చంద్ రెండవ పిల్లవాని వైఖరి గమనించిన తక్షణమే, అతని మనస్సునకు ఏదో ఒక పెద్ద Shock తగిలినట్లైనది. కాని అతడు తన భావాన్ని పైకి వెల్లడింపక, "ఎట్లా చదువుచున్నారు?" అని క్షేమసమాచారములు విచారించినాడు. అంతలో రైలు కదలిపోయింది. పెద్దకుమారుడు రైలు కదలి పోయేంతవరకు నమస్కారము చేస్తూ నిలుచున్నాడు. ఈ చిన్న కుమారుడు మాత్రము తాను "టా, టా" అంటూ నిలుచున్నాడు. అటు తరువాత ఆ పిల్లలిద్దరు ఇంటికి వెళ్ళిపోయినారు.

ప్రేమ్‌చంద్‌కు రెండవ కుమారుని చర్య మానసికముగ ఎంతో అసంతృప్తిని, అశాంతిని కలిగించింది. ప్రేమ్‌చంద్ భార్య భర్తను చూచి, "ఏమిటండీ! మీరింతగా అశాంతిని Feel అవుతున్నారు? అని అడిగింది. ప్రేమ్‌చంద్ భార్యను చూచి, "చూచితివా! చిన్నవాడు మనకు నమస్కారము చేయలేదు. చిన్నవాడు మనకు Respect ఇవ్వలేదు" అన్నాడు. తిరిగి ఆతడు "చూచితివా! మన చిన్నవాడు మనకు నమస్కారము చేయలేదు" అన్నాడు. ఈ విధముగా అనేక పర్యాయములు ప్రేమ్‌చంద్ భార్యతో చెబుతూ వచ్చాడు. ప్రేమ్‌చంద్ భార్య తన భర్తకు ఈ విధంగా సమాధానము చెప్పింది, "ఎందుకండీ! వాడు మనకు నమస్కారము చేయకపోవటములో వచ్చిన నష్టమేమిటి? కాబట్టి మీరింతగా బాధపడకూడదు" అని పల్కింది. ప్రేమ్‌చంద్ తాను పొందిన బాధను ఈ విధంగా భార్యతో వ్యక్తం చేసికొన్నాడు, "నా నిమిత్తము కాదు నేను బాధపడుతూ ఉండేది, వాని భవిష్యత్తు చెడిపోతుందని, పాడైపోతుందని బాధపడుచున్నాను" అన్నాడు. కాబట్టి, ఏ విద్యార్థి తన తల్లిదండ్రులను గౌరవిస్తాడో, ఆ విద్యార్థే భవిష్యత్తులో చక్కని ఆదర్శాన్ని పొందగలుగుతాడు.

అదే స్థితికి వచ్చింది ఈ ప్రేమ్‌చంద్ కుమారుల పరిస్థితి. చూచితిరా! ప్రేమ్‌చంద్ పెద్దకుమారుడు చక్కగా చదివి Bar at law పాసైనాడు. కొంతకాలానికి అలహాబాద్‌లోని హైకోర్టులో జడ్జిగా నియమితుడైనాడు. హైకోర్టుకు వచ్చిన వారందరూ ఆ పెద్దకుమారునికి నమస్కారములు చేస్తున్నారు అదే అలహాబాద్‌లోని ఆ హైకోర్టులోనే ఈ చిన్నకుమారుడు ఒక చిన్న Clerk పని చేస్తున్నాడు. హైకోర్టునకు వచ్చిన వారందరికీ ఈ చిన్నకుమారుడు

నమస్కారములు చేస్తున్నాడు. తల్లిదండ్రులకు గౌరవమిచ్చిన విద్యార్థి అందరి నమస్కారములందుకొంటున్నాడు; తల్లిదండ్రులకు respect ఇవ్వనటువంటి కుమారుడు అందరికీ నమస్కారములు చెప్పుకుంటున్నాడు. ఇదే చరిత్రలో మాయనిమచ్చ. కనుక ఎన్ని చదువులు చదివినప్పటికీ, ఎంత ఉన్నత పదవి ఏలినప్పటికీ మొట్టమొదట తల్లిదండ్రులకు గౌరవం ఇవ్వండి.

పుత్రప్రేమ చేత తల్లిదండ్రులు ఎంతో స్వాతంత్ర్యము ఇస్తారు. వారు ఆ స్వాతంత్ర్యమును ఇచ్చినప్పటికీ మీరు వారిని ఉల్లంఘింపక, వారిని గౌరవించుటకు ప్రయత్నించాలి. వారు వారి స్థాయినుండి ఆ స్వాతంత్ర్యమిచ్చినను, మీ స్థాయి నుంచి మీరు చక్కగా గుర్తించి వారిని గౌరవించాలి. మానవుడు నిత్య జీవితంలో ఏ యేవిషయాన్ని, ఏ యే సమయములో, ఏ యేసందర్భములో, ఏ యే విధముగా నడచుకోవాలి, జీవించాలి అనే సత్యాన్ని గుర్తించి, మీరు జీవితములో అట్టి ఆదర్శాన్ని మున్ముందు అందించాలని ఆశిస్తూ, ఆశీర్వదిస్తూ నా ప్రసంగాన్ని విరమిస్తున్నాను.

—శ్రీవారి దివ్యబోధ

20—మే—1991,

బృందావనం.



## సందర్శనం

అరుదెంచెనమ్మ! మేస్టరుగారి కుర్చీని
మార్చింగు చేయించు "మాంత్రికుండు"
వేంచేసెనమ్మ! వేర్వేరు పూలకు అక్ష
రాలు నేర్పిన "ఇంద్రజాలికుండు"
దయచేసెనమ్మ! చిత్రములోని చట్రాయి
సాయిగా మార్చిన "చతురశిల్పి"
అగుపించెనమ్మ! వింతగ చింతచెట్టునే
కల్పవృక్షము సేయు "గారడీడు"
నిండుకొలువుండెనమ్మ! మా గుండెలోని
బొండుమల్లెల ముత్యాల మండపమున
ధర్మ సంస్థాపనార్థమై ధరణి మీద
మానవుండైన దేవుండు మాధవుండు!!

## చక్కదనాలసాయి

"జలజల" కురిసెనే! సన్నజాజుల వాన,
చాలులే! అది సత్యసాయి నవ్వు;
"బుసబుస" పొంగెనే! పూర్ణిమాకౌముది,
చాలులే! అది సత్యసాయి కరుణ;
"గమగమ" లాడెనే! కమ్మ కస్తురి తావి,
చాలులే! అది సత్యసాయిరాక;
"గణగణ" మ్రోగెనే! గజరాజు మెడగంట,
చాలులే! అది సత్యసాయి యాజ్ఞ;
"తీయతీయగ" పాడెనే! కోయిలమ్మ,
చాలులే! అది శ్రీ సత్యసాయి పిలుపు;
"మెల్లమెల్లగ" మెయి సోకె చల్లగాలి,
చాలులే! అది మన సత్యసాయి చేయి!!

—కరుణశ్రీ

# బృందావనంలో వేసవి తరగతుల విశేషాలు

గీ॥ అదిగొ! "బృందావనము" త్రయీనాదమదిగొ! । అదె! కళాశాల! సుజ్ఞాన యజ్ఞశాల'
సాయిగోపాల దేవుండు జగతి కొఱకు । విశ్వమంగళ "మురళి" విన్పింపసాగె

గీ॥ అఖిల భారత విశ్వవిద్యాలయ ప్ర । ధాన పండితుల్ వక్తలై తనరినారు
బాలబాలికా ఛాత్రులు, భక్తవరులు । ఆలమందలై, శ్రోతలై అలరినారు.
"విరిసె వేసవి తరగతుల్ వెన్నెలగుచు"

భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారు పదకొండు ఏళ్ళతరువాత క్రిందటి సంవత్సరం 20, మే 1990 (ఏకాదశి) నాడు వేసవి వెన్నెల తరగతులను ప్రారంభించి జూన్ 3, 1990 (ఏకాదశి) నాటికి ముగించిరి. తిరిగి ఈ సంవత్సరం కూడా అదే రీతిగనే ఈ వేసవి తరగతులను మే 20, 1991 నుండి జూన్ 2, 1991 వరకు దిగ్విజయంగా యావద్భారత దేశంలో ఎన్నడూ, ఎక్కడా, కని, విని యెరుగని రీతిగా జరిపించినారు.

ఈ వేసవి తరగతులు బృందావనం కళాశాల ఆడిటోరియంలో భగవాన్ శ్రీ సత్యసాయి ఆధ్వర్యాన శ్రీ సత్యసాయి ఇన్స్టిట్యూట్ ఆఫ్ హైయర్ లెర్నింగ్ విద్యార్థినీ విద్యార్థులకు, హైయ్యర్ సెకండరీ స్కూల్ విద్యార్థులకు ఏర్పాటు చేయబడినవి. ఈ సందర్భంలో బృందావనం క్యాంపస్ కళాశాలను అత్యద్భుతమైన వివిధాలంకరణలతో విద్యార్థులు అలంకరింప జేసినారు. 20-5-1991 సాయంత్రము 4-30 ని॥లకు ఈ వేసవి తరగతుల ప్రారంభోత్సవమునకు ముందుగ వానజల్లులు కురిసి, ఆనాటి ప్రకృతినంతయు చల్లని గాలులతో హృదయాహ్లాదకరంగా మార్చినది. ఉష్ణోగ్రత తగ్గి, ప్రశాంతవాతావరణమంతటా అలముకొన్నది. ఇదంతా భగవానుని సంకల్ప ప్రభావమే.

భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారు విద్యార్థినీ విద్యార్థుల వేసవి తరగతులను ప్రారంభిస్తూ, "విద్యార్థినీ విద్యార్థులు తమ జీవితములను నిర్మల, నిస్స్వార్థ, భక్తి భావములతో దేశసేవకై అంకితము గావించుకొనవలెనని" ఈ సందర్భమున నొక్కివక్కాణించినారు. ఈ తరగతులు కేవలం భారతీయ సంస్కృతి, ఆధ్యాత్మికత అన్న అంశములపైననే నిర్వహింపబడినవి. ఈ వేసవి తరగతులలో వేయిమందికి పైగా విద్యార్థినీ విద్యార్థులు, శ్రీ సత్యసాయి యూనివర్సిటీకి చెందిన ప్రశాంతినిలయం, బృందావనం, అనంతపురం మొదలగు కళాశాలల అధ్యాపక బృందంతోసహా అనేకమంది వక్తలు పాల్గొనుట జరిగినది. భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారు ప్రవచించిన దివ్యసందేశాలు మరియు వివిధ వక్తల సందేశాలు ఈ వేసవి తరగతులకు వన్నె తెచ్చినవి, విజ్ఞానవికాసమును చేకూర్చినవి.

ఈ వేసవి తరగతుల ప్రారంభోత్సవ సమయమున కర్ణాటక రాష్ట్ర గవర్నర్ శ్రీ ఖుర్షీద్ ఆలంఖాన్ జ్యోతులను వెలిగించి, వేసవి తరగతులను ప్రారంభించినారు. శ్రీ సత్యసాయి యూనివర్సిటీ ఉపకులపతి యైన డా॥ యస్. సంపత్‌గారు గవర్నర్‌గారిని ఆహ్వానిస్తూ, "ఎన్నడూ, ఏ దేశమునందు ఇటువంటి వేసవి తరగతులు జరుపబడలేదని" ఘంటాపథంగా చెప్పినారు. గవర్నర్‌గారిని ఆహ్వానించుచున్న సందర్భమున విద్యార్థులు వేదపఠనం చేసినారు. విద్యార్థినీ విద్యార్థులతో ప్రత్యేకంగా ఆహ్వానింపబడిన అతిథులతో, వందలకొలది భక్తులతో ఆనాడు సభామంటపము క్రిక్కిరిసి యుండెను. ప్రతిఒక్కరూ ప్రసంగములను వినుటకు అనువుగా 'లౌడ్ స్పీకర్సు' ప్రతిచోటా ఏర్పాటు చేయబడినవి.

"ఒక్క శ్రీ సత్యసాయి యూనివర్సిటీనందే, కులపతి విద్యార్థుల మధ్య కలసి మెలసి తిరుగుతూ ఇటువంటి కార్యక్రమాలలో పాల్గొనుట సంభవమని" ద్వితీయ యం. బి. ఎ. కోర్సు విద్యార్థియైన చి॥ గణేష్ తన ఉపన్యాసములో పేర్కొన్నాడు.

గవర్నరుగారు జ్యోతులను వెలిగించిన తదుపరి ఈ వేసవి తరగతులను ప్రారంభించుట గొప్ప ఆనందదాయకమైన విశేషమని, తమ అదృష్టమని అన్నారు. అటుపిమ్మట "శ్రీ సత్యసాయి విశ్వవిద్యాలయం జరుపుచున్న ఈ వేసవి శిబిరము, ఇందు జరుపబడుచున్న శిక్షణలు ఎంతో విశిష్టమైనవని, నేడు విశ్వవిద్యాలయములు క్రమశిక్షణారాహిత్యముతో, అనేకమైన ఆందోళనలతో ఛిన్నాభిన్నమగుచున్నవని, ప్రశాంత వాతావరణములో జరుపుతున్న ఈ వేసవి శిబిరముల నుండి ప్రశాంత సందేశములు వెలువడి దేశమునకు శాంతిసంతోషములు ప్రసాదించునని నా ఆకాంక్ష. మీరు ఈ విశ్వవిద్యాలయములో మీ విద్యలను ముగించిన తదుపరి మీరు పొందియున్న శాంతి సందేశాలను మీతోబాటు కొనిపోయి ప్రపంచమంతటా పలువురకు పంచిపెట్టుదురని నా ఆశ. ఈ విశ్వవిద్యాలయంలో మీరు సముపార్జించిన సత్యసందేశము బయట ప్రపంచములోని విషమపరిస్థితులను ఎదుర్కొనగల శక్తి, సామర్థ్యములను తప్పక అనుగ్రహించునని నా అభిమతం. మనమందరమూ ఒక దేశమునకు చెందినవారమని, మన దేశ భవిష్యత్తు, మన సమైక్యత కేవలం మన కార్యదీక్షపై ఆధారపడి యుండునన్న విషయము మనమెన్నడూ మరువరాదు. విచ్ఛిన్నకరమైన మార్గములను అవలంభిస్తున్న విచ్ఛిన్నవాదుల వాదోపవాదములను వినక మన దేశ సమైక్యతకై, ఆత్మవిశ్వాసంతో మనము పాటుపడాలి. మన యువతరమే మన దేశమునకు ఆస్తి, వారే మన ఆశాజ్యోతులు. మనం సాధించలేకపోయినవాటిని నేటి యువతరము సాధింతురని నా ఆశయము, అదే నా కోరిక. జీవితమంటే ఒక అగ్నిపరీక్ష. మీరు ఈ అగ్నిపరీక్షను ఎదుర్కొని మీ మీ కార్యక్రమాలలో కృతకృత్యులు కాగలరని భావిస్తాను, విశ్వసిస్తాను" అని కర్ణాటక గవర్నర్‌గారు ఉత్తేజకరమైన భావగాంభీర్యంతో యువతరానికి తమ సందేశమును అందించినారు.

[మే 20వ తేదీనాడు గవర్నరుగారి ప్రారంభోపన్యాసము తదుపరి, భగవాన్ శ్రీ సత్యసాయి బాబా వారు తమ దివ్యసందేశమును అందించినారు. ఆనాటి వారి సందేశము ఈ పత్రికలో ప్రచురింపబడినది. ఈ వేసవి తరగతులందు శ్రీవారు అనుగ్రహించిన సందేశాలు రాబోవు సంచికలలో రాగలవు.]

రమారమి 15 రోజులపాటు ప్రతిరోజూ బాబా వారు భారతీయ సంస్కృతి, ఆధ్యాత్మికత, ఉపనిషత్తుల ప్రసంగములతో తమ ప్రబోధములను అత్యంత సులభముగా ప్రతి ఒక్కరికి తేటతెల్లంగా ప్రబోధించినారు. ఇతర విశ్వవిద్యాలయముల నుండి వచ్చిన విద్యావేత్తలు కూడా ఈ తరగతులందు పాల్గొని తమ విజ్ఞాన పీయూషమును అందించినారు. భగవానుడు సత్యసాయి కాళాశాల ఉపాధ్యాయులకేకాక, వందలకు

పై బడిన ఆహ్వానితులకు, ఉపాధ్యాయ కుటుంబాలకు, వెయ్యిసంఖ్యకు పైబడిన విద్యార్థినీ విద్యార్థులకు— ఉచితవసతి, భోజన సదుపాయములు ఏర్పాటు చేసి నారు. 26వ తారీఖున "సాయికథ" గానము చేయ బడినది, మరియు 27వ తారీఖున కర్ణాటకప్రాంతపు బాలవికాస్ విద్యార్థులచే "అరిషడ్వర్గములు" అనే నాటకము ప్రదర్శింపబడినది. 28వ తేదీన మద్రాస్ శ్రీ కదిరి గోపీనాథ్‌గారు కర్ణాటకసంగీత సరళిలో త్యాగరాజు కీర్తనలలో "ఎందరో మహానుభావులు", "నగుమోము కనలేని" అనే కీర్తనలను "SAXO-PHONE" అనే తమ వాయిద్యముపైన ధ్వనింప జేసినారు. ఇదే సందర్భమున పి. వి. గోపాలకృష్ణ గారు మృదంగము ద్వారా తమ కళాకౌశలమును ప్రదర్శించినారు. 29వ తేదీన విద్యార్థుల సాంస్కృతిక కార్యక్రమము జరిగినది. జూన్ 1వ తేదీనాడు తమిళ నాడు బాలవికాస్ బాలురు దశావతారఘట్టము, షిర్డీ సాయి — పర్తిసాయి మున్నగు వృత్తాంతములను "నృత్యభంగిమల" చేత ప్రదర్శించినారు. 2వ తేదీ ప్రాతఃకాలమున వేసవి తరగతుల ముగింపు సందర్భమున ఏర్పాటు గావింపబడిన వీడ్కోలు సమావేశము నందు శ్రీవారు తమ సందేశమును, ఆశీస్సులను అనుగ్రహించినారు. అటుపిమ్మట ప్రసాదములను అందరికీ పంచిపెట్టినారు. ఆనాటి సాయంత్రం భగవానుని సమక్షమున విద్యార్థులచే "క్విజ్" కార్యక్రమము నిర్వహింపబడినది. ఈ సందర్భమున కూడా భగవానుని ఆశీస్సులందరికీ లభించినవి.

ఈరీతిగా మహోన్నత వైభవముగా వేసవి తరగతులు భగవానుని సమక్షంలో విజ్ఞానప్రదాయకంగా భారతీయసంస్కృతికి ఆలవాలంగా, ఆనందదాయకంగా ఆధ్యాత్మిక మార్గమునకు సోపానములుగా కొనసాగింప బడి తమ విజయగీతములను పాడుకొన్నవి....

—వి. వేంకటేశ్వర్లు,
ప్రశాంతినిలయం.



## సత్యసాయి మహితోక్తులు:

1) ఎంతవీరుడైనను, ధీరుడైనను దైవబలం లేనిచో దానుడై చెడును. 2) కాలుజారితే కలుగదు నష్టము, నాలుకజారితే నరకమురా! 3) పశుభావములు పారద్రోలిన, పశుపతిభావములు ఉప్పొంగును. 4) నీ విశ్వాసమును నీవు అనుసరించుము. పరుల మాటలకు బానిస కావద్దు. 5) స్వార్థరహిత సేవయే స్వామికి ప్రీతి. 6) దయగల హృదయమే దైవమందిరం. 7) బాహ్య నిశ్శబ్దత ఎంత ప్రధానమో, అంతరంగిక నిశ్శబ్దత అంత ప్రధానం 8) సత్యమే నీ తండ్రి. 9) ప్రేమయే నీ తల్లి. 10) జ్ఞానమే నీ పుత్రుడు. 11) శాంతియే నీ పుత్రిక. 12) భక్తియే నీ సోదరుడు. 13) యోగులే నీ మిత్రులు. 14) చర్మవాసన కలవాడు చండాలుడు, బ్రహ్మవాసన కలవాడు బ్రాహ్మణుడు. 15) అనుమానమే ఆస్తికునకు అంటువ్యాధి. 16) అణాలకన్నా గుణాలే ప్రధానం. 17) జీతం 'జీవితం' కొరకు కాదు, జీవించుటకు. 18) హింసయే కంసుడు, అహింసయే పరమహంస. 19) దైవానుగ్రహం కలవానిని ఏ గ్రహం ఏమీ చేయలేదు.



# మమత నుంచి మాధవత్వానికి

భగవాన్ శ్రీ సత్యసాయినాథుని జనని పేరు ''ఈశ్వరమ్మ''. ఒక అమాయికవు, అక్షరాస్యత లేని, సాధారణ సాత్విక గృహిణి. సంప్రదాయాన్ని గుర్తించి తన ఇల్లే స్వర్గమనీ, తనవారే సర్వస్వమని ఎంచిన నిరాడంబరురాలు! భగవాన్ అవతరణకు ఈశ్వరమ్మను మాతృమూర్తిగా ఎంచుకోవటం ఆమె పూర్వజన్మల తపఃఫలితం, భగవానుని దివ్యానుగ్రహం కారణాలు కావచ్చు. అయితే జగదోద్ధారణ కోసం అవతరించిన మహనీయమూర్తి తల్లి ఒక అమాయికురాలుగానో, ఒక సాధారణ భక్తురాలుగానో జన్మను చాలించితే అందులో ప్రత్యేకత ఏముంటుంది? ఆమె కూడా విశ్వజనని స్థాయికి ఎదగాలి. మమతా బంధాలలో జీవితాన్ని ప్రారంభించినప్పటికీ నిర్మమత, నిర్వ్యామోహతల మార్గంలో నడచి, ఆత్మసాక్షాత్కారము పొందాలి. చరితార్థురాలు కావాలి. తోటి మహిళా లోకానికి ఒక మార్గదర్శకురాలై, చిరస్థాయిగా విశ్వ జనావళి హృదయాలలో 'విశ్వజననిగా' నిలచిపోవాలి కదా! అదే జరిగింది ఆమె దివ్యజీవనచరిత్రలో!

## మమతాబంధాలు - మాయామోహాలు

ప్రతి మనిషి జీవితము అహం, మమతల బంధాల్లో ఇమిడిపోయి, అవిద్యా మోహంలో మునిగి ఉంటుంది! అదే దుఃఖ కారణంగానూ, అదే జనన మరణాల అనంతచక్రానికి మూలంగానూ మన తత్త్వశాస్త్రము వివరిస్తోంది ఈశ్వరమ్మ కూడా ఈ సాధారణ జీవనస్థితికి అతీతురాలుకాదు కదా! అందుకే చిన్నారి సత్యన్నారాయణరాజు బాల్యం నుంచి చేసే దివ్యలీలలు చూచి, ఆమె మాతృహృదయం ఆశ్చర్యం చెందినట్లే, ఆవేదననూ పొందినది. సత్యానికి దయ్యం పట్టిందనో, బ్రహ్మరాక్షసి పట్టిందనో లోకం విమర్శి స్తుంటే ఆమె వినలేకపోయింది! "నా బాబు జ్ఞాని కానక్కరలేదు, లోకానికి గురువూ కానక్కరలేదు! ఒక సామాన్యమైన బిడ్డడుగావుంటే చాలు భగవంతుడా" అని దైవానికి దండంపెట్టుకొనేది.

భగవాన్ బాబావారు తమ 14వ ఏట అవతార ప్రకటనచేశారు. ఎంతోదిగులుతో పుట్టపర్తి నుంచి ఆతని అమ్మా నాన్న ఉరవకొండకు పరుగులు తీశారు. తీరా వారిని చూచిన బాలబాబా "మాయవస్తోంది - మాయ వస్తోంది" అన్నారు. ఒక కన్నతల్లిగా తన కన్నబిడ్డ అలా అనటం విని, ఆమె విల విలలాడిపోయింది. "నన్ను అమ్మా అని పలుకరించవా!" అని ప్రాధేయపడి అడిగింది. ఆమె మమతను తొలగించుటకై, అప్పుడే అవతార ప్రకటనచేసిన భగవాన్ ఆమెకిచ్చిన సమాధానం ఏమిటి? "ఎవరికెవరు?" అనెను. "ఎవరికెవరు?" అనే ఈ ప్రశ్న వేసుకోవటంలోనే మాయనుంచి మానవుడు విముక్తుడయ్యే మార్గము ఉందని తల్లితో చెప్పకయే చెప్పారు భగవాన్ బాబా! ఈ ప్రశ్నకు సమాధానం పొందటమే జీవిత పరమార్థం. దాన్ని సాధించిన ఈశ్వరమ్మ, "విశ్వజనని ఈశ్వరాంబ" అయింది.

## మనం పొందే తపనయే తపస్సు

మనం చేసే ఆధ్యాత్మిక సాధన వెనుక "ఎవరికి ఎవరో" తెలుసుకొని నడచుకొనగలిగితే, ఆత్మసాక్షాత్కారం ఆ క్షణంలోనే అవుతుంది. కానీ, ఈనాడు మన తపన అంతా దేనికోసం? డబ్బు, హోదా, సుఖం, ఆయుర్దాయం ఇంకా — ఇంకావి వ్నింటి కోసమో! లౌకిక వ్యవహారాల్లో మనస్సు ఎప్పుడు నిమగ్నమైతే దానిని 'తపన' అంటారు. అదే తపన దైవము వైపునకు మరల్చితే "తపస్సు" అంటారు.

భగవాన్ బాబావారు పుట్టపర్తిలో నే ఉంటూ, దానినే తమ దివ్య కార్యక్రమానికి, తమ అవతార కార్యక్రమానికి, మానవోద్ధరణ ఉద్యమానికి కేంద్రముగా ఎంచారు. ఒక ప్రక్కన భగవాన్ అవతార కార్యక్రమాలు ఎంతో వేగంగా, విస్తృతంగా వ్యాపించుతూ ఉన్నాయి. ఆనాడు ఎన్నెన్నో సందర్భాలు, సన్నివేశాలు ఈశ్వరమ్మను వేధించేవి. ఆమె అనుక్షణం సత్యం కోసం, తన ముద్దుల తనయుడైన సత్యం కోసం ఆవేదన చెందేది. ఎవరెవరో వచ్చి, స్వామిని ఆశ్రయించి, స్వామికి క్షణం తీరిక లేకుండా చేస్తున్నారు. తన చేతిమీదుగా అన్నం ముద్దలు తినిపించే అవకాశం లేకుండా చేస్తున్నారు. "పోనిలేండి! మీరయినా నా బాబును జాగ్రత్తగా కాపాడుకోండి" అనేది ఆమె, ఇదొక తపన. స్వామి తనను 'అమ్మా' అని పిలవరు. తనను "ఇంటి అమ్మాయి" అంటారు. తండ్రిగారిని "ఇంటి అబ్బాయి" అంటారు. ఎంత విరాగంతో కూడిన పిలుపు. ఇదొక తపన.

భగవాన్ దివ్యలీలలు, మహిమలు ఎక్కడెక్కడో జరుగుతున్నాయి, ఎందరెందరో వస్తున్నారు. వారిలో ఓర్వలేనివారుంటారు, గిట్టనివారుంటారు, వారు తన సత్యకు ఏమికీడు తలపెడతారో ఇదొక తపన. పైగా, "నన్ను ద్వేషించేవారిని సైతం నేను ప్రేమిస్తాను, వారినీ సుఖపెడతాను" అంటాడు సత్య. ఇదొక దిగులు. సత్య ఏడవ తరగతిలోనే చదువు చాలించినా, ఎందరెందరో పండితులకు కూడా తెలియని ఆధ్యాత్మిక రహస్యాలు చెబుతున్నాడు. కొందరు ఉద్దండ పండితులు ఉంటారు. వారు అసూయచేత సత్యకు ఏమీతెలియదని, తామే తెలిసినవారమని ప్రకటించుకోవచ్చు. అప్పుడు అలా జరగటం సత్యకు అవమానం కదా? ఇదొక తపన, ఇదొక దిగులు. భక్తులు వచ్చి ఎంతెంతో దూర ప్రాంతాలకు, ఇతర రాష్ట్రాలకు తీసుకువెళ్ళుచున్నారు. అసూయచేత ఆ ప్రాంతంవారు సత్యకేదైనా తమ క్షుద్రశక్తులచేత కీడు కలిగిస్తారేమో అని ఇదొక దిగులు, తపన. మాతృహృదయాన్ని పగలనక, రాత్రి అనక ఎప్పుడూ వేధించే తపన ఇదే. ఇంకా ఇలాంటి భయాందోళనలు ఎన్నో ఉండేవి. దీనికి ఫలితంగా, తనకు తెలియకుండానే స్వామిని గూర్చి నిరంతరం చింతన పెంచుకున్నది. అదే ఆ తల్లికి అనన్యచింతన అయింది. ఆమె ఎక్కడ ఉన్నా, ఎంత దూరాన ఉన్నా, ఏక్షణం లోనయినా, ఎప్పుడూ స్వామి - స్వామి అని తపన పడేది. అదే ఆమెపట్ల తపస్సు అయింది. ఆమె తపన — తపస్సు ఒక్కటే.

ఆధ్యాత్మికమైన అభ్యున్నతిని మనలో కలిగించి, మన నిజతత్త్వాన్ని మనచేత గుర్తింపజేయటమే స్వామి అవతరణ ఉద్దేశ్యం. అందుకు మనచేత స్వామి సాధన చేయిస్తున్నారు. సాధకులకొరకే తాను వచ్చింది. తల్లి అయినా, ఎవరైనా సరే సాధన స్వీకరించకపోతే సాక్షాత్కారం లేదు. కనుకనే ఈ తపన, తపస్సు ఈశ్వరమ్మను 'విశ్వజనని ఈశ్వరాంబ గా రూపొందించాయి. అదే ఆమె అదృష్టం, భగవానుని అనుగ్రహం.

## సందేహాలు తొలగుచున్న సాధన

క్రమంగా భగవాన్ బాబావారిపట్ల ఆమెకుగల సందేహాలు పటాపంచలమైపోయినాయి. స్వామి భక్తులు కూడా స్వామి సన్నిధిలో ఎన్నెన్నో చూస్తూనే ఉంటారు, వింటుంటారు. అయినాసరే, "స్వామి నిజంగా భగవంతుడేనా?" అనుకుంటూ తమ యొక్క

సందేహాన్ని, అవిశ్వాసాన్ని ఋజువు చేసుకుంటారు. ఈశ్వరమ్మ సాధనలో కూడా ఈరీతిగా కలిగిన ఎన్నో సందేహాలు తొలగి, "స్వామి నిజంగా దైవమే" అని గుర్తించగలిగింది. సందేహం పూర్తిగా తొలగినప్పుడు, అహం, మమతలమాయ, భయము, నశించినప్పుడు "ఈతడు నా సత్య అని భావించటం పొరపాటు. ఇతడు సాక్షాత్తు విశ్వనాథుడు, దేవాధిదేవుడు" అనే ప్రత్యక్ష అనుభవం ఆమెకు లభించింది. ఈ విధమైన పరిణతినిగూర్చి శ్రీ యన్. కస్తూరిగారు "విశ్వజనని ఈశ్వరమ్మ" అనే గ్రంథంలో ఇలా వ్రాస్తారు;— "జీవితము అంటే- ఒక బాధ నుండి మరొక బాధకు ప్రయాణం అని ఈశ్వరాంబ అర్థంచేసుకొన్నది. పుట్టగానే ఏడవడం అనేది జీవిత ప్రయాణము ను తలచుకోవటమే అనిపించింది ఆమెకు. ఇట్టి ఆలోచనల వలన ఆమె మతి పోగొట్టుకోలేదు. కానీ, ఆమె హృదయం గట్టిపడినది. కనుకనే జీవితం అనే ఈ దుఃఖసాగరంలో ఆమె ఉల్లాసంగా తేలియాడింది. ప్రశాంతినిలయానికి వచ్చే స్త్రీలను ఎంతమందినో అనునయిస్తూ, సలహాలనిస్తూ, దైవమునందు విశ్వాసమునేగాక, ఆత్మవికాసమును కూడా ఆమె పొందగలిగింది".

భగవాన్ బాబావారితో ఈశ్వరమ్మ భారతదేశంలోని వివిధ పుణ్యక్షేత్రాలను సందర్శించారు. బదరీయాత్ర అనుభవాలవల్ల తన సత్య సాక్షాత్తు నారాయణుడే అనే నమ్మకం దృఢపడింది. ఆలాగే గుజరాత్‌లోని సోమనాథస్వామి ఆలయంలో భగవాన్ బాబావారు సోమనాథుని లింగంలో దివ్యతేజస్సును పునఃప్రతిష్ఠించినప్పుడు తన సత్యలో జగదీశ్వరుని చూడగలిగింది. ఆలాగే ద్వారకాక్షేత్రంలో సాక్షాత్తుగా తన సత్య కృష్ణుడే అనే నమ్మకం కలిగింది. ఈ అనుభవాన్నే ప్రత్యక్షానుభవం అంటారు. అది ఎవరో పొందిన అనుభూతిని విని ప్రతిస్పందించటం కాదు. తన "అంతర్వాణి" తనకు చెబుతోంది- సాక్షాత్తుగా తన సత్య దైవమే అని. ఈ దివ్యానుభూతిలో కలిగే ఒక ఆచరణీయమైన క్రియాశీలతే సేవ. ఆమె దివ్యానుభూతి ఆమెను సేవపట్ల ఆకర్షించింది. అప్పుడామె చేసిన సేవ సత్యసాయి నుంచి ఏదీ ఆశించలేదు. ఆమె తోటి మానవాళిలో తన సాయినే సందర్శించుతూ సేవ చేసింది.

## సేవాసాధనలో ఈశ్వరమ్మ

భగవాన్ శ్రీ సత్యసాయి బాబా చేసేది, చెప్పేది, చేయించేది సేవయే. సేవయే మానవ జీవితానికి తరణోపాయం. సేవకు మించిన సాధన లేదు. కర్మ, భక్తి, జ్ఞానం అన్నీ సేవలోనే ఉన్నాయి. ఈ పరమార్థాన్ని గ్రహించిన ఈశ్వరమ్మ, స్వామి సన్నిధికి చేరుకొనే ఎందరెందరో స్త్రీల జీవితాల్లోకి సానుభూతితో, ప్రేమతో సేవతో ప్రవేశించగలిగేది. భగవానుని పుట్టినరోజు సందర్భంలో, వివిధ పండుగల సందర్భాలలో తాను కూడా చేతనయినంత సేవలు చేస్తూ, సేవాదళంలోని మహిళలకు ఆదర్శప్రాయురాలైనది. "స్వామి జీవితమే ఆమెకు సందేశం అయినదనియు, 'అమ్మ' ఆమె కుమారునికి మొదటి శిష్యురాలు" అని శ్రీ యన్. కస్తూరిగారు అన్నారు. అమ్మ ప్రేరణ వలననే స్త్రీ విద్యోద్ధరణ కోసము అనంతపూర్‌లో మహిళలకు ఒక కళాశాల వెలసింది. అందరినీ తన వాళ్ళుగా, ఒకే దైవం యొక్క బిడ్డలుగా ఈశ్వరమ్మ గుర్తించగలిగిన స్థితికి ఎదిగింది. పుట్టపర్తికి వచ్చేవారిని కులం, గోత్రం ప్రశ్నించేది కాదు. అందరూ అంటతగినవారే, దేవుని బిడ్డలలో కులము అనే విషయాన్ని తెలుసుకోవటం పాపం అనుకొన్నది. ఈ రీతిగా అందరినీ సమానంగా ప్రేమిస్తూ, అందరికీ సేవలుచేసే బాధ్యత, సాధన ఆమె స్వీకరించినది.

## సాక్షాత్కారం — తుదిపిలుపు

ఈశ్వరాంబ వ్యక్తిత్వంలో పరిపూర్ణమైన పరిణతి కలిగింది. దాని ఫలితమే నిరంతరం స్వామిని చింతించటం. 1972 మే నెల, బృందావనంలో యావత్ భారతదేశము నుంచి వచ్చిన 800 మంది విద్యార్థులకు వేసవి శిబిరంలో ఉపన్యాసాలు జరుగుతూ

ఉన్నాయి. అదొక పెద్ద పండగవలె తోచినది. అట్టి తరుణంలో ఈశ్వరమ్మకు జ్వరం తగిలింది. స్వామి ఆమె వద్దకు వచ్చారు. "నాకు ఒళ్ళంతా నొప్పులుగా ఉంది, నా దగ్గరకు వచ్చిన స్వామిని చూచాను. ఏమి చెప్పేది! నాకు మామూలుగా స్వామి కనబడలేదు- శ్రీరామచంద్రుడు కోదండంతో, కిరీటంతో సాక్షాత్కరించాడు. చేతులెత్తి నమస్కరించాను" అంటూ ఈశ్వరమ్మ తనకు కలిగిన సాక్షాత్కారానుభవాన్ని పెద్దబొట్టమ్మతో చెప్పింది. అమ్మ వచ్చింది కూడా ఆ పరంజ్యోతిలోనుండే కదా! మరల ఈ శరీరాన్ని విడిచి, కలిసేది కూడా ఆ పరంజ్యోతిలోనే కదా! ఈ అనుభూతినే స్వామి ఆమెకు చివరిరోజులలో కలిగించారు.

అది 6-5-1972. ఆ రోజు ఉదయం ఈశ్వరమ్మ స్నానం చేసింది. కాఫీ తీసుకొని వరండాలో కూర్చొన్నది. బాత్‌రూం వైపుపోతూ బిగ్గరగా "స్వామీ - స్వామీ" అంటూ రెండు సార్లు కేక వేసింది. "వస్తున్నా! వస్తున్నా!" అంటూ స్వామి పలికారు. అంతే ఆమె అంతిమ శ్వాసను "స్వామీ" అంటూనే వదిలింది. స్వామిలో అమ్మ లీనమైపోయింది. అర్తితో ఆమె పిలిచింది, జీవిత సమాప్తి అయింది. ఆమె పవిత్రతకు, నిర్మలత్వానికి ఇదే నిదర్శనం. ఆమె జీవితం దైవంలో కలిసిపోయింది" అన్నారు ఆమె తుది ఘడియలను గూర్చి చెబుతూ భగవాన్ బాబావారు. ఈ రీతిగా ఒక 'మమతాబంధం నుంచి మాధవత్వంలోనికి లీనమైన దివ్యజీవన పరిణతికి ఒక పవిత్ర సంకేతం ఈశ్వరమ్మ దివ్యజీవనవిధానం'. ఈ హేతువుచేత ఆమె "విశ్వజనని ఈశ్వరాంబగా" మన అందరి నివాళులు ఆనాడు - ఈనాడు - ఏనాడూ అందుకుంటూనే ఉంటుంది....

—పాతూరి ప్రసన్నం
(హైదరాబాద్)

## భూలోకస్వర్గం పుట్టపర్తి

'ఈశ్వరాంబా' స్తుతి । ఇంపుగా వినిపించు ।
భూలోకస్వర్గంబు । పుట్టపర్తి ।
'ప్రణవనాదంబు'తో । పరిశుద్ధులను చేయు ।
భూలోకస్వర్గంబు । పుట్టపర్తి ।
'విద్యాగిరీ'రత్న । వైభవంబును చాటు ।
భూలోకస్వర్గంబు । పుట్టపర్తి !
'చిత్రావతీ'తీర । క్షేత్రమై రాణించు ।
భూలోకస్వర్గంబు పుట్టపర్తి ।
వేయి కనుల తోడ । విష్ణురాజేంద్రుడు ।
కునుకుదీయకుండ । కొలువుయున్న ।
పుట్టపర్తి కన్న । భూలోకస్వర్గంబు ।
కలియుగంబులోన । కలదెచూడ ।

—ఏ. కా. రామచంద్రరావు (గణపవరం)

## సాయినాథా!

కోరికతో నిన్నుగూర్చి పాటలుబాడ
సంగీతమే రాదు సత్యసాయి!
సాహిత్య ప్రక్రియ చక్కగా విన్పొగడ
పాండిత్యమే లేదు పర్తివాస!
నీ రూపు చిత్రించి నిన్ను మెప్పింపంగ
చిత్రకారుడగాను చిద్విలాస!
నీ యానతలదాల్చి నేర్చి సేవలు జేయ
వార్ధక్యమొకటొచ్చె వారిజాక్ష!
ఎట్లు మెప్పింతు నిన్నింక నెట్లుగొల్తు
నాదు భారము నీదయ్య నళిననేత్ర!
జాలమేటికి ననుగావ సార్వభౌమ
సర్వమీవేగదా! నాకు సత్యసాయి!

—న. వెం. రంగనాథస్వామి (ఖండివరం)

# ధన్యహో! ఈశ్వరాంబ!

ఉ॥ శ్రీకర సత్యసాయిని, విశిష్టగుణాఢ్యుని, దేవదేవు "ర
త్నాకర" వంశమందు పరమాత్ముఁడునై తనరార; ధాత్రిలో
నీ కమనీయ గర్భమున నిన్ను తలంపగ కంటివమ్మ! బల్
ప్రాకటమైన భక్తి తన భక్తులు కొల్వగనుండె పర్తిలో.

ఉ॥ నీదగు గర్భమందు అవనీతలమందున పుట్టగోరుచుఁ
శ్రీదయితుండు సాయి; నిను చేరెను గర్భములోన తానె; ఆ
మోదము కల్గజేసె నవమోహన కృష్ణుఁడు సత్యసాయి; స
మ్మోదముగూర్చె దేవుఁడయి; మోదముపొంద ప్రపంచమంతయు।

ఉ॥ ధన్యవు ఈశ్వరమ్మ! కడుధన్యవు నీ సుకృతంబదేమొ? సౌ
జన్యవు మాతలందున; విశాల జగత్తున నిన్ను బోలు వా
రన్యులు కానరారు; పరమాత్మనికన్న వరాలతల్లి! సా
మాన్యులకర్థమౌనె? అల మాధవుఁడే జనియించె ధాత్రిలో.

ఉ॥ నీదు "సమాధి" వద్ద మరి నిల్వని, మ్రొక్కని వాఁడు లేడు ఆ
మోదముతోడ కొల్తురిఁక; మోహనమూర్తికి కన్నతల్లివై
ఆదరమందినావు; మరిఅంతటి దేవుని తల్లివౌటచే
పాదులుగట్టె ప్రేమరసపాకము మా హృదయంబులోపలఁ.

గీ॥ దేశదేశాలు పర్తిలో జరిల్లు
నీవు కన్నట్టి 'శ్రీసాయి' నీరజాక్షు
చేరికొల్వంగ నెవ్వేళ చెల్మిగాంత్రు
అన్ని వర్ణాలు వత్తురానందమొంది
ఇంతకన్నను భాగ్యంబు నెచట కలదు?

గీ॥ ఆత్మవిజ్ఞాన తేజంబులందుకొన్న
శుద్ధసాత్విక సౌజన్య సుగుణఖనివి
తల్లి! నీవంటి 'బంగారుతల్లి'నెపుడు
తలచి, కొలచిన చిత్తంబు
ధన్యమగును!

—"కవికుమార్", ప్రశాంతినిలయం.

# నీతి గల్గిన జాతి నిజమైన జాతి

"శైలే శైలే విహరద్దైవం, విపినే విపినే విచరద్దైవమ్
గ్రామే గ్రామే ఖ్యాతం దైవం, నగరే నగరే ప్రచలద్దైవమ్"

"పర్వతములయందు, ఉన్నతమైన స్థాయియందు, ఉత్తేజమైన భావములతో ఉఱ్ఱూత లూగుతూ విహరించేదంతా దైవమే. అడవులయందు, ప్రశాంతమైన వాతావరణమునందు, దివ్యమైన వినువీధులయందు, చల్లగాలులయందు, పిల్లవాయువునందు విహరించేది దైవం. ప్రతిగ్రామమునందు దివ్యప్రకాశముతో, మానవత్వముతో, అన్యోన్యమైన అనుకూలముతో దివ్య వాతావరణమునందు గడిపేవాడే దైవం. పట్టణములయందు అందచందములతో, అనుకూల వాతావరణములతో, దివ్యానుభూతులతో, మానవులను వికసింపజేసి, ప్రకటింపజేసి దివ్యమైన తత్త్వాన్ని వెదజల్లేవాడే దైవం".

విద్యార్థులారా! విద్యార్థినులారా!

కొలనుకు తామరపుష్పమే శృంగారము, గ్రామమునకు గృహములే శృంగారము, సముద్రమునకు తరంగములే శృంగారము, ఆకాశమునకు చంద్రుడే శృంగారము— సర్వత్రా సౌందర్యవంతమైన శృంగారమే దైవస్వరూపము. కనుకనే ఉపనిషత్తులు "సత్యం, శివం, సుందరం" అని వర్ణిస్తున్నాయి. మానవులకు మానవత్వమే శృంగారము. మానవ సమాజములో ప్రధానముగా ఉండవలసినది మానవత్వము. అందుచేతనే "జాతియొక్క గౌరవము నీతిపై నిలుచును. నీతి లేకయున్న జాతి చెడును. నీతికలిగిన జాతి నిజమైన జాతి" అని చెప్పవలె. ఎన్ని విద్యలు నేర్చినా, ఎంతటి వైజ్ఞానికులైనా, ఎంతటి పదవులనేలినా, దానితోపాటు మానవత్వమును అభివృద్ధిగావించుకోవాలి. మానవత్వము ఎంతగా అభివృద్ధి గావించుకొందుమో, అంతగా సమాజము, దేశము అభివృద్ధి అవుతాయి. మానవత్వమే కోల్పోయినచో, సమాజ గౌరవమే పోతుంది. అంతియేకాదు. సమాజముపైన ఆధారపడిన దేశము కూడ తన గౌరవాన్ని కోల్పోతుంది.

## నీతి - నిజాయితి

మానవజాతి గౌరవము నీతి నిజాయితీలతో కూడిన మానవత్వముపైన ఆధారపడి ఉంటుంది. ఈనాడు విద్యార్థులు పోషించుకోవలసినది మానవత్వం. ఈ మానవత్వము ఆధ్యాత్మిక వాతావరణమునందు మాత్రమే అభివృద్ధి కాగలదు. ఈ మానవత్వము అన్య వాతావరణములందు అభివృద్ధి అగుటకు అవకాశములేదు. విత్తనము మట్టిలో నాటి, నీరుపోసినప్పుడే అది మొక్క అయి, వృక్షమై ఫలములనందిస్తుంది. అట్లుకాక బీజములు ఒక డబ్బాలో (టిన్) పెట్టి, నీరు పోస్తే కుళ్ళిపోతుంది. నీతి నిజాయితీలు మానవతా హృదయమునందు మాత్రమే అభివృద్ధి అగుటకు అవకాశమున్నది. మానవత్వానికి, సద్గుణములకు ఆధారం నీతి. నడత యొక్క పరిపూర్ణతే నీతి. భోగభాగ్యములు, సిరిసంపదలు నీతిపైన ఆధారపడి ఉంటున్నవి. ప్రాచీనకాలము నుండి అన్ని దేశములకు ఆధ్యాత్మిక సంపత్తితో నీతి నిజాయితీలను బోధించిన దేశము భారతదేశము. నీతినిజాయితీలే భగవంతుని సత్యనిలయాలు. నీతిలేకుండిన మానవజాతియే పోతుంది. నీతి మానవుని ఉన్నతస్థాయికి కొనిపోతుంది. ఈనాడు దేశమునకు అవసరమైనది నీతియే.

మార్షల్‌పోప్ యుద్ధ సమయమందుకాని, ప్రాణాపాయ సమయమునందుకాని, ఎట్టి కఠినమైన స్థితియందైనను కాని నీతిని విసర్జించకూడదని బోధించాడు. విక్టోరియారాణి ప్రధానమంత్రియైన విలియమ్ గ్లాడ్‌స్టన్ నీతి నిజాయితీలను సర్వకాలములయందు పోషించినాడు. కనుకనే విక్టోరియారాణి కంటెను ప్రధానమంత్రిని ప్రజలు గౌరవించేవారు. ఈ నీతి ఇంద్రియ నిగ్రహంచేత అలవడుతుంది. ఎవరినివారు శాసించుకోగలిగిన శక్తిని కలిగినవారే, ఇతరులను శాసించడానికి అధికారి అవుతాడు. తనను తానే శాసించుకోలేని బలహీనుడు ఇతరులను ఏ రీతిగా శాసించగలడు? కనుక మొట్టమొదట మానవుడు తనను తాను శాసించుకొనుటకు తగిన కృషిచేయాలి. తనమాట, తన ప్రవర్తన రెండింటినీ ఏకంగావించే జీవితం గడపాలి. ఈ విధంగా మాట, క్రియ ఏకమైనప్పుడే తాను మహత్తరమైన విభూతులను అనుభవించగలడు. "ఏమానవుడు తాను చెప్పిన మాట ప్రకారముగా నడచుకొనునో అట్టివాడు మనిషేకాదు, మహిమాన్వితుడగును. ఏమానవుడు తాను చెప్పిన మాట ప్రకారంగా నడచుకొనడో, అట్టివాడు మనిషి కాదు కేవలం మృగమే". ఈనాటి మానవ సమాజములో మాటకు, క్రియకు సంబంధము లేదు. మాట, క్రియతో కూడినదే సత్యము. మనస్సు, మాట, క్రియతో కూడినదే ఋతము.

## ప్రతీ విద్యార్థి దాంతుడు కావాలి

విద్యార్థులు దేశాభిమానాన్ని, దేశ ఔన్నత్యాన్ని, దేశ కళ్యాణాన్ని మనస్సు నందుంచుకొని ప్రవర్తనయందు ఆదర్శజీవితాన్ని అందించాలి. ఈనాటి విద్యార్థులకు ఇంద్రియ నిగ్రహమంటే ఏమిటో తెలియదు. దీనికి "సంయమము" అని పేరు. ఈ సంయమము మానవులకు మాత్రమే చెందునది. ఇంద్రియములను అనుసరించి స్వేచ్ఛా విహారం జరుపుటచేత మానవుడు తన దివ్యత్వాన్ని కోల్పోతున్నాడు. ఇట్టి ఇంద్రియ నిగ్రహమునకు సంస్కృతమునందు "దమము" అని పేరు. ఈ దమమును సాధించినవాడే- "దాంతుడు". ఈనాడు లోకానికి దాంతులు కావాలికాని, వేదాంతులు అక్కరలేదు. ఈనాటి వేదాంతము మాటలతో మాత్రమే జరిగిపోతున్నది. వాచాలత్వము అధికమైపోతున్నది. ఆడంబరములు కూడా అంతే. ఆచారములు సన్నగిల్లి ఆనందము శూన్యమైపోతోంది. ప్రతీ విద్యార్థి దాంతుడు కావాలి. ఏవిధంగా ప్రవర్తించాలి అనే విషయం ఈనాటి విద్యార్థులకు ఏమాత్రం తెలియదు. ఇది విద్యార్థుల దోషంకాదు. తల్లిదండ్రులు, గురువులు ఉత్సాహ, ప్రోత్సాహములు అందించకపోవటమే ఈ పరిస్థితికి కారణము. విద్యార్థులు తమ

ప్రవర్తన సరియైన స్థితియందుంచుకొని, తమ ఇంద్రియాలను నిగ్రహించుకొని, తద్వారా సమాజములో శాంతిని పోషించాలి.

ఈనాటి పిల్లలకు చిల్లర అల్లరి మాటలే చాలా అభిరుచి. ఇదే వారికి మోజు, ఫోజు. మంచిమాటలు వారికి గిట్టవు. ఆధ్యాత్మికమంటే హాస్యాస్పదముగా భావిస్తారు. ఈ విధమైన వాతావరణము దినదినానికి అభివృద్ధిగావడం చేతనే, విద్యాప్రయోజనమును గుర్తించుకోలేకపోతున్నారు. విద్య కేవలం ఉద్యోగాల నిమిత్తమని, ధనార్జన నిమిత్తమని దుర్భావం దూరం చేసుకోవాలి. విద్య జీవితపరమావధి అనే సత్యాన్ని మరవకూడదు. జీవనోపాధి నిమిత్తము ఉద్యోగము ఆచరించవలసినదే. ఈ ఉద్యోగమునందు నీతి నిజాయితీలను విడువకుండా ఆదర్శాన్ని నిరూపించాలి. ఈనాడు విద్య లోకాన్ని మోసము చేయటానికి, లంచాలు కొట్టడానికి, అన్యాయ, అక్రమ, అనాచార, అసత్యములతో ప్రవర్తించడానికి చదివినట్లుగా గుర్తింపబడుతోంది. చదువులేర్పడినది దీని నిమిత్తం కాదు. విద్య జ్ఞాన నిమిత్తం. ఇట్టి విద్య ధనార్జనకు మాత్రమే ప్రధాన లక్ష్యం కావడంచేత, విద్యావిలువలు శూన్యమైపోతున్నాయి. ధనముకాని, విద్యకాని చెడ్డవి కావు. మనం ఉపయోగించుకొనే విధానములోపల వాని విలువలు నిలిచి ఉంటాయి.

## నిజమైన సేవ

విద్యార్థులారా!

మనము ఎంత గాలిని పీల్చుకొంటున్నామో అంత గాలిని విడువక తప్పదు. విడువకుండిన మన ఊపిరితిత్తులు దెబ్బతింటాయి. కనుక ధనమును సంపాదించవలసిందే. విద్యను నేర్చవలసిందే. కానీ ఈ ధనమును, విద్యను తిరిగి వినియోగపరచాలి. సన్మార్గములో దీనిని ప్రవేశపెట్టాలి. ఈ విధమైన భావాలు విద్యార్థులలో కలగాలి. చదివిన చదువును సమాజంలో ప్రవేశపెట్టి తద్వారా ప్రజలకు సరియైన ఆనందమును, అనుకూలతను మనము కలిగించాలి. ధనమును సమాజములో సరియైన రీతిలో సద్వినియోగపరచాలి. ఆ విధముగా సమాజంలో సద్వినియోగం చేయకున్నచో, ఆ ధనము మట్టితో సమానమే. ఏ సమాజము నుండి మనము ఆర్జించామో, తిరిగి ఆ సమాజమునకు అర్పితము గావించాలి. అదే నిజమైన సేవ. విద్యార్థుల యందు త్యాగభావము ఎక్కడా కనిపించుట లేదు. ప్రోగుచేసుకోవటం - ప్రోగుచేసుకోవటం ఇది జీవితములో One way traffic గా ఉంటోంది. తీసుకొన్నదానిని తిరిగి వినియోగించాలి. తిరిగి అందించాలి. అప్పుడే జీవితములో ఉన్నత స్థాయికి చేరగలము. చాలామంది విద్యార్థులకు 'ఈత' తెలియదు. జలమును మనం వెనుకకు నెట్టుతూపోతుంటే దేహం ముందుకు సాగిపోతుంది. జలమునే వెనుకకు త్రోయకుండిన దేహము ముందుకు కదలలేదు. వెనుకకు .... వెనుకకు త్రోస్తూపోవాలి. Past is past ఆ విధముగా చేసుకొంటూ పోవటంచేత మనము ఎంతైనా జీవితాన్ని ఉన్నతస్థాయికి తీసుకొనిపోగలము.

## దుష్టవాంఛలు వీడుటయే త్యాగము

ఈనాడు మనము చేయవలసిన త్యాగము కేవలం ధనమును మాత్రమే కాదు. మనలో ఉన్న దుర్గుణాలను త్యాగం చెయ్యాలి. మన దుర్గుణములను త్యాగం చేయటమే నిజమైన త్యాగము. అంతేకాని ఆస్తిని, ఆలిని వీడి అడవికేగుట కాదు. భావమందు దుష్టవాంఛలు వీడుటే త్యాగమగును, అదియె యోగమగును. అప్పుడే మానవత్వము పరిపూర్ణత్వము కాగలదు. కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములనేవి—మానవుని కేవలం హతమార్చేస్తున్నవి. వీటిని జయించుట చాలా ముఖ్యము. చంద్రునిలో 16 కళలు ఉన్నాయి. చంద్రుడు 16 కళలూ పెంచుకున్నప్పుడే జగత్తునకు ఆదర్శము. లోకానికి ప్రశాంతమైన ప్రకాంతిని అందివ్వడానికి

వీలౌతుంది. అట్లే మానవునియందు పదహారు గుణములున్నాయి. ఈ పదహారు గుణములను నిర్మూలము చేసినప్పుడే, మానవత్వానికి గొప్ప ప్రకాశము కలుగుతుంది. ఏమిటి ఈ 16 దుర్గుణాలు? అరిషడ్వర్గములు ఆరు, మదములు ఎనిమిది, రజస్తమోగుణాలు రెండూ చేరిస్తే పదహారు దుర్గుణములౌతాయి. వీటిని నిర్మూలము గావించుకోవాలి. కర్తృత్వ, భోక్తృత్వాలను తగ్గించుకోవాలి అన్ని విధముల భగవంతునికి అర్పితము చేసి, "సర్వం బ్రహ్మమయం" అనే స్థితిలోపల సత్కర్మలు ఆచరిస్తూ పోయినప్పుడు, భగవంతుడు సమస్త సహాయములందిస్తాడు.

## మానవుడు సంఘజీవి

విద్యార్థులు జీవితమనే భవనమునకు పునాది వంటివారు. మీరు బ్రహ్మచారులు. బ్రహ్మచారి అనే పునాదిపైననే గృహస్థాశ్రమము అనే గోడలు కడుతున్నారు. ఈ గృహస్థు అనే గోడల పైననే వానప్రస్థమనే పైకప్పు వేస్తున్నారు. వానప్రస్థమనే కప్పువేసి జీవితము జరుపుకొంటూ వస్తున్నారు. కనుక భవనమునకు బ్రహ్మచారులు పునాది వంటివారు. పునాది భద్రముగా లేకున్న భవనమంతా కూలిపోతుంది. కనుక విద్యార్థులు భద్రమైన గుణములను అభివృద్ధిగావించుకోవాలి. గుణమే లేకుండిన జీవితములో శాంతి ఉండదు. మనము సమాజములో పుట్టినాము, సమాజములో పెరిగినాము, సమాజములోనే మన జీవితాన్ని గడుపుతున్నాము. సమాజమే లేకపోతే మన జీవితమే లేదు. కాని దురదృష్టవశాత్తు నేటి మానవుడు "నేను-నా కుటుంబము" అనే స్థాయిలోనే నిలిచిపోతున్నాడు. సమాజము వరకు ప్రయాణము చేయుటలేదు. సమాజమేలేకపోతే నీ కుటుంబమెక్కడ? నీవెక్కడ? సమాజములో నీవొక వ్యక్తివి. సమాజమునే లెక్కచేయకపోవడంచేత, స్వార్థము, స్వప్రయోజనము ఈ రెండింటితో గడుపుటచేత నీకు శాంతి, సౌఖ్యములు దూరమైపోతున్నాయి. స్వార్థం - స్వార్థం తరువాతనే దైవము. కనుకనే మానవుడు ఆశించిన ఆనందాన్ని అందుకోలేకపోతున్నాడు. తాను ఎక్కడ నుండి వచ్చినాడు, ఏ ఆధారంతో జీవిస్తున్నాడు అనే విషయాన్ని మానవుడు మరచిపోతున్నాడు.

## మన ప్రాచీన సంస్కృతిని పునరుద్ధరించండి

విద్యార్థులారా! మీరు ముఖ్యంగా మూడు విషయాలు మాత్రము ఎప్పుడూ విస్మరించరాదు. భారతీయులు సత్యవ్రతులు, ధర్మపరాయణులు, న్యాయమూర్తులు. విద్యార్థులు సత్య, ధర్మ, నీతి, నిజాయితీలతో జీవించడానికి తగిన కృషిచేయాలి. వేదం చెప్పింది--- "సత్యం వద, ధర్మం చర". ఈ రెండింటిని ప్రధానముగా తీసికోవాలి. అనాది కాలము నుండి భారతదేశం ఇట్టి సత్కీర్తిని సంపాదించినది. మన ప్రాచీన సంస్కృతిని తిరిగి పునరుద్ధరించండి. వేదోపనిషత్ పురాణేతిహాసములను ఆదర్శరూపంలో, అన్యోన్య భావంతో ప్రకటించి, ప్రచురించినది భారతదేశము. భారత దేశము పవిత్రమైన సందేశాలను అందించి సర్వదేశములకు నాయకత్వం వహించినటు వంటిది. దేశాభిమానమును మీరు ఏనాడూ వదలకూడదు. ఏయే దేశములవారు ఆయా దేశాభిమానమును పెంచుకొనుటలో తప్పులేదు. దేశాభిమానమును పెంచుకోవచ్చును. కాని పరదేశ విమర్శన చేయరాదు. ఏ మతాన్ని అలక్ష్యముచేసి విమర్శించరాదు. ఇంతటి విశాలభావాన్ని పెంచుకోవాలి. పరమ పావనమైన భారతావనియందు సహనమన్నదే మనకందరికీ చక్కదనము కాగలదు. అన్ని వ్రతములయందు కీర్తికెక్కినటువంటిది, కఠినమైన తపస్సుతో సమానమైనటు వంటిది సత్యశీలమే. తల్లి ప్రేమ కంటే అమితమైన ప్రేమను అందిస్తుంది ఈ దేశము. దేశాభిమానం, దేశ సంస్కృతి, దేశ ఔన్నత్యము మీరు కాపాడాలి.

## భగవద్విశ్వాసము — భగవన్నామము

"లోకాస్సమస్తా స్సుఖినో భవంతు" అనే ప్రార్థన నిత్య ప్రార్థనగా, అందరూ సుఖముగా ఉండాలని ప్రార్థనచేయండి. దేశముపైన, మతముపైన, వ్యక్తిపైన ద్వేషం, అయిష్టత పెంచుకోవద్దు. సంకుచిత భావాలు త్యజించి, విశాలమైన భావాలు పెంచుకోండి. భగవద్భక్తిని వదలకండి. భగవత్ప్రేమయే లేకపోతే ఈ జగత్తంతా శూన్యము. కనుక ఎట్టి పరిస్థితియందైనా భగవత్ప్రేమను వదలకండి. అదే "మీ వెంట, జంట, ఇంట, కంట ఉంటుంది మిమ్మల్ని కాపాడుతుంది". ఏలాంటి పరిస్థితియందైనా భగవంతుని నిందించ కూడదు. సుఖ దుఃఖములకు మధ్యలో ఉంటుంది జీవితం. ప్రాకృతమైన బాధలను లెక్కచేయకూడదు. భగవద్విశ్వాసాన్ని కలిగినప్పుడు ఎన్నైనా సాధింపవచ్చు. క్లిష్టపరిస్థితులందైనా భగవన్నామాన్ని మరువకూడదు. మీ జీవిత ప్రవాహములో భగవద్విశ్వాసము, భగవన్నామము నావగా తోడ్పడుతుంది. కనుక నామస్మరణ చేయండి.

—శ్రీవారి దివ్యబోధ
2—జూన్—1990.
బృందావనం.

## చందాదారులకు విజ్ఞప్తి

(ఎ) వార్షిక చందా 20 రూపాయలు మనియార్డరు ద్వారా— కన్వీనరు, శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్సు ట్రస్టు, ప్రశాంతినిలయం (పోస్టు), అనంతపురం జిల్లా, ఎ. పి. — 515 134కు పంపవలెను.

(బి) వేరుగా ఎక్నాలెడ్జిమెంటు కోరువారు తమ చిరునామాగల రిప్లైకార్డు పంపవలెను.

(సి) చందాలు ఒక సంవత్సరమునకు మాత్రమే స్వీకరింపబడగలవు.

(డి) చందాదారు పూర్తిపేరు, చిరునామా మనియార్డరు కూపను (సమాచార్ అనుచోట) పైననే స్పష్టముగా పెద్ద అక్షరాలతో వ్రాసి పంపవలెను.

(ఇ) మనియార్డరు కూపనుపైన, పత్రిక (ఇంగ్లీషు / తెలుగు) ఏ భాషలో కావలెనో స్పష్టముగా పేర్కొనవలెను.

(ఎఫ్) చందాల రెన్యూవల్ కోరునప్పుడు, ప్రస్తుత చందాసంఖ్యను పేర్కొంటూ, రెండునెలలు ముందుగా పంపవలెను.

(జి) క్రొత్తగాచందాలు కట్టినవారికి చందా స్వీకరించిన రెండుమాసాల తర్వాత నుండి పత్రిక పంపగలం.

గురుదేవ వాణి:

# వేదస్వరూపం

"నాస్తి లోభసమో వ్యాధిః నాస్తి క్రోధసమో రిపుః
నాస్తి దారిద్ర్యవత్ దుఃఖం నాస్తి జ్ఞానసమో సుఖః"

"లోభమునకు సాటియైన వ్యాధి మరొక్కటి లేదు. క్రోధముతో సాటియైన శత్రువు మరొక్కడు లేడు. దారిద్ర్యమునకంటె మించిన దుఃఖము మరొక్కటి లేదు. జ్ఞానము కంటె పరమమైన సుఖము మరొక్కటి కానరాదు. కాని ఇట్టి పవిత్రమైన జ్ఞానమునకు మానవుడు అతి దూరమైపోతున్నాడు".

విద్యార్థులారా!

ఈ ప్రపంచములో మిక్కిలి ప్రాచీనమైన సాహిత్యం 'వేదసాహిత్యం'. ఇది విజ్ఞానరాశి. మానవుని సర్వతోముఖాభివృద్ధిని గావించునది ఈ వేదమే. మానవుని చరిత్రకు మొట్టమొదటి పాఠ్య గ్రంథము వేదమే. మానవ సంస్కృతికి, పదశక్తికి, సర్వశక్తికి మూలాధారము, పుట్టినిల్లు ఈ వేదమే. "సర్వం వేదాత్ ప్రసిధ్యతే" అన్నాడు మనువు. సమస్త విద్యలు వేదమునుండి ఆవిర్భవించినవే. సర్వ గుణములు, సర్వధర్మములు వేదము నుండే ఆవిర్భవించినవి. "అనంతోవై వేదాః" వేదము అనంతం, అగాధం, అప్రమేయం, ఆనందమయం. "విద్" అనే ధాతువు నుండి ఈ వేదము పుట్టినది. ఈశ్వర జ్ఞానమే వేదము, ఆత్మజ్ఞానమే వేదము, బ్రహ్మ జ్ఞానమే వేదము, అద్వైతజ్ఞానమే వేదము, విజ్ఞానమే వేదము. ఇవన్నీ ఆత్మజ్ఞానమునకు పర్యాయ పదములు. ఇట్టి పవిత్రమైన వేదమును సామాన్యులు అర్థము చేసుకొనలేరు. అర్థము చేసుకొన్ననూ, చేసుకొనకపోయిననూ వేదము యొక్క దివ్యత్వమే సర్వత్రా వ్యాపించి ఉంటున్నది.

"శబ్దబ్రహ్మమయీ, చరాచరమయీ, జ్యోతిర్మయీ, వాఙ్మయీ, నిత్యానందమయీ, పరాత్పరమయీ, మాయామయీ, శ్రీమయీ" ఇదియే ప్రజ్ఞానమయమైన బ్రహ్మము (Constant Integrated Awareness) ఇది ఒక కాలమునకుగాని, ఒక స్థానమునకుగాని, ఒక వ్యక్తికిగాని సంబంధించినది కాదు. యావద్విశ్వమునకు సంబంధించినది. ఇట్టి వేదమును సామాన్య ప్రజలు గుర్తించటంగాని; వర్తించడంగాని సాధ్యము కాదని తెలుసుకొని వ్యాసులవారు దీనిని నాలుగు విధములుగా విభజించినారు.

## కర్మకాండ, జ్ఞానకాండ, ఉపాసనాకాండ

వేదమునకు "త్రయీ" అని పేరు. ఇది జగత్తునకు ఆచారరూపమైన ప్రచారము గావిస్తూ వచ్చింది. కర్మకాండ, జ్ఞానకాండ, ఉపాసనాకాండని వేదం త్రికాండ స్వరూపం. మానవుడు కర్మాధిపతి. "కర్మణ్యేవాధికారస్తే" మానవుడు కర్మాధికారముతో కాయమును ధరించాడు; ఈ కర్మలు ధర్మమయమైనవిగా ఆచరించాలి. కనుకనే "శరీరమాద్యం ఖలు ధర్మసాధనం" అన్నారు. ధర్మసాధన నిమిత్తమై ఈ కాయం ఆవిర్భవించినదనే సత్యాన్ని గుర్తించాలి. మానవుడాచరించే కర్మలు పరిపక్వస్థితికి వచ్చినప్పుడు ఇదే ఉపాసనగా మారుతుంది. ఉపాసన దైవార్పిత భావముతో, ప్రేమమయమైన దివ్యతత్త్వంతో ఆచరించినప్పుడు ఇదియే పూర్ణజ్ఞానముగా రూపొందుతుంది. ఏతావాతా కర్మ, ఉపాసన, జ్ఞానం మూడూ ఒక్కటే వృక్షమునకు పుష్పము పుట్టి, కాయగామారి, ఫలంగా రూపొందినట్లుగా మానవునకు కర్మ పుష్పమువంటిది, ఉపాసన కాయవంటిది, జ్ఞానం ఫలమువంటిది. కనుక సామాన్య మానవులు కర్మోపాసనాజ్ఞానములు ఆచరించే నిమిత్తమై పురాణేతిహాసములు దీనికి ఉపాంగములుగా సృష్టింపబడినవి.

వేదముయొక్క అంతమే ఉపనిషత్తు. కనుకనే "వేదాంతము" అని పేరు. ఉపనిషత్తులు "యోగత్రయము" అని మూడుగా విభజించి మూడు యోగములను మానవులకు ప్రబోధిస్తూ వచ్చాయి. యోగమనగా అర్పితభావము. మనము ఏ కర్మలను చేసినా అర్పితభావముతో ఆచరించాలి. దైవార్పిత భావముతో ఆచరించటం చేతనే, ఇది దైవార్పిత భావమనే పేరు పొందింది. "సర్వకర్మ భగవత్ ప్రీత్యర్థం" అనే మార్గమును అనుసరిస్తూ వచ్చింది. యోగత్రయములో రెండవది ఉపాసనాయోగము. భగవంతుని హృదయపూర్వకంగా, ప్రేమపూర్వకంగా, త్రికరణశుద్ధిగా ప్రేమించుటయే ఉపాసనాయోగము. కేవలము అభీష్టసిద్ధికై, కార్యసిద్ధికై, లౌకికమైన భ్రాంతులసిద్ధికై - ప్రేమించడము ప్రేమ కాదు. ప్రేమ నిమిత్తమై ప్రేమించాలి. అదే ఉపాసనాయోగము. ఇంక మూడవది జ్ఞానయోగము. "సర్వం విష్ణుమయం జగత్" అంతా భగవంతుని స్వరూపమే. సర్వులయందు ఉండినవాడు భగవంతుడు ఒక్కడే, ఏకాత్మభావమే. అద్వైతజ్ఞానమే నిజమైన జ్ఞానమన్నారు.

## ఉపనిషత్సారమే భగవద్గీత

ఉపనిషత్తుల నుండి భగవద్గీత ఆవిర్భవించింది. ఇది షట్కర్మలనే మార్గములను మరొక విధంగా లోకానికి బోధించినది. గీత షడంగముల రూపాన్ని ధరించింది. గీత యందు ఆరారు అధ్యాయములకు ఒక షట్కము చొప్పున పదునెనిమిది అధ్యాయములు ఉన్నవి. మొదటి షట్కము కర్మ మార్గము, రెండవ షట్కము ఉపాసనా మార్గం, మూడవది జ్ఞానమార్గం. మొత్తముపైన వేదము నుండి ఉపనిషత్తులు, ఉపనిషత్తులనుండి భగవద్గీత, భగవద్గీత నుండి భవ్యమైన, ఆచరణరూపమైన మానవత్వ విధానము ఆవిర్భవించినవి. గీత యొక్క సారమే మానవ విజ్ఞానము. ఈ మానవజాతి యొక్క విజ్ఞానము, అభిమతము గీతయే. భగవద్గీత భారతీయులకు మాత్రమే సంబంధించిన ప్రాపర్టీ కాదు. యావద్విశ్వమునకే సంబంధించినది. ఇది భగవద్గీత, భగవంతుని యొక్క వాక్యం.

## దైవం ఒక్కడే

సర్వులకూ భగవంతుడు ఒక్కడే. ఇట్టి ఏక స్వరూపాన్ని ధరించిన భగవంతుని అనేక భావముల చేత, అనేక నామములచేత, అనేక రూపములతో ఆరాధిస్తూ వచ్చారు. "ఏక ప్రభుకే అనేక నామ్" దైవం ఒక్కడే. హిందువులుగాని, మహమ్మదీయులుగాని, క్రిష్టియన్స్‌గాని, బౌద్ధులుగాని, పార్శీలుగాని, సిక్కులుగాని వేరువేరు రూపములను ఆరాధిస్తున్నా,

అందరికీ భగవంతుడు ఒక్కడే. ఏపేరు పెట్టుకొని ఏ రూపమును ఆరాధించినా దైవానికే చెందుతుంది. కనుకనే "సర్వజీవ నమస్కారం కేశవం ప్రతిగచ్ఛతి" అన్నారు. ఎవరికి నమస్కారం చేసినప్పటికీ అదంతా భగవంతునికే చెందుతుంది. పాత్రలు వేరు వేరు కాని ప్రతిబింబము ఒక్కటే. అదే విధముగా దేహమనే పాత్రయందు ఆత్మతత్త్వము అనే ప్రతిబింబము విడి విడిగా కనిపిస్తూవుంటుంది. "ఒక సూర్యుఁడు సమస్త లోకములకున్ ఒక్కొక్కడై" సూర్యుడు ఒక్కడే. అమెరికన్ సూర్యుడని, బ్రిటీష్ సూర్యుడని, చైనా సూర్యుడని, భారతదేశం సూర్యుడని— వేరే ప్రత్యేకమైనవి లేవు కదా! అయితే ఒక్కొక్క దేశమువారు ఒక్కొక్క సమయములో ఆ సూర్యుని చూడవచ్చు. అందరూ ఒకేసారి చూడడానికి సాధ్యము కానంత మాత్రమున వేరు వేరు సూర్యులుంటారని భావించడం వెఱ్ఱితనము కదా!

## "శృతి" అనగా ఏమిటి?

వేదములు విశాలమైన, అనంతమైన, అగాధమైన అర్థములు కలిగి ఉంటాయి. పూర్వము వేదములను బోధించుటకు గురువులు చాలా కఠినమైన చర్యలు తీసుకొనేవారు. ఆనాడు గురువుల అంతటి కఠినమైన చర్యలను పాటించుట చేతనే వేదము ఇంతకాలము నిలువగలిగినది. ఇది గ్రంథస్వరూపంకాదు, శృతి. శృతి అనగా కేవలం వినికిడి చేతనే లభ్యమయ్యేటటువంటిది. వేదము అనాదికాలం నుండి గురు శిష్య పరంపరగా వ్యాప్తిని చెందుతూ, అందుకుంటూ వస్తోంది. గురువులు ఉచ్చరించటము, శిష్యులు తిరిగి అదేరీతిగా ఉచ్చరించటం. స్వరబద్ధముగా ఉచ్చరించాలి. ఆనాటి గురువులు స్వార్థరహితులు, పరిశుద్ధహృదయులు, పరతత్త్వ భావములు కలిగినవారు, ప్రేమ తత్త్వంతో కూడినవారు. విద్యార్థుల అభివృద్ధి నిమిత్తమై తమ జీవితములనే అంకితము గావించినారు.

## అకార పంచకం

ఆనాటి విద్యార్థులు ఆ శిక్షణకు కట్టుబడి తూ. చ. తప్పక నియమములను పాటించేవారు. ఆజ్ఞను ఉల్లంఘించే విద్యార్థిని ఆ పరిసర ప్రాంతమునకు రానిచ్చేవారు కాదు. అకార పంచక అరిష్టములు కలిగిన వ్యక్తిని గురువులు సహించేవారుకారు. అకారముతో ప్రారంభమయ్యే అరిష్ట పంచకంలో మొదటిది అలక్ష్యము, రెండవది అవినయము, మూడవది అహంకారము, నాలుగవది అసూయ, ఐదవది అసభ్యత- ఈ ఐదింటిని కూడినవాడు విద్యార్థిగా తగినవాడు కాదు. అలక్ష్యము చేయకూడదు, అవినయము ప్రకటించ కూడదు, అహంకారం అంతకంటే ప్రమాదమైనది, అసూయ మహాపాపస్వరూపమైనది, ఇంక అసభ్యత- మానవుడుగా ఉండికూడా సమాజమునందు ఏ విశిష్ట భావముతో జీవించాలో, దానికి విరుద్ధముగా జీవించుటయే అసభ్యత.

## గురుకుల ప్రాశస్త్యం

వ్యాసులవారి దగ్గర అనేకమంది శిష్యులు వేదాధ్యయనము నిమిత్తమై చేరేవారు. అందులో మొదటివాడు వైశంపాయనుడు. ఇతను భక్తిశ్రద్ధలతో, వినయ విధేయతలతో గురువాజ్ఞను పాటించి తన జీవితమును సార్థకము గావించుకొన్న వ్యక్తి. "సద్గుణంబులు, సద్బుద్ధి, సత్యనిరతి, భక్తి, క్రమశిక్షణ, కర్తవ్యపాలనము"— మున్నగునవి నేర్పునదే విద్య. అట్టి విద్యను విద్యార్థి నేర్వవలయును. ఈ విధముగా గురువుదగ్గర వైశంపాయనుడు విద్యను నేర్చుకొని, తిరిగి తాను వేదమును బోధించే నిమిత్తమై ఒక గురుకులమును స్థాపించినాడు. గురుకులమనగా అభ్యాసములచేత, ప్రత్యేకమైన నిబంధనలచేత ఏర్పడినదని భావిస్తారు. అదికాదు గురుకులము. గురుకులము అనగా గురువుగారి ఇల్లే శిష్యులకు నిలయం. గురువు భుజించునదే శిష్యులకు ప్రసాదంగా ఇచ్చేవారు. రాత్రింబవళ్ళు గురువుతోనే జీవితము గడిపేవారు.

## యాజ్ఞవల్క్యుని విద్యాహంకారం

వైశంపాయుని గురుకులమునందు యాజ్ఞవల్క్యుడనే విద్యార్థి ప్రవేశించినాడు. ఇతడు మహామేధావి. చురుకైన బుద్ధిగలవాడు. ఏనాటి విద్యలు ఆనాడేనేర్చి గురువులకు అప్పజెప్పేవాడు. అతని తెలివితేటలకు గురువు చాలా సంతసించేవాడు. ఇతని తెలివితేటలు, మేధాశక్తిని గూర్చి పదిమంది మాటలాడుకోవడం జరిగేది. ఈ హేతువు చేత యాజ్ఞవల్క్యునకు అహంకారము చిన్న మొలకగా ప్రారంభమైనది. అహంకారము ప్రారంభమయ్యేటప్పటికి, ఆతనిలో కొంత అలక్ష్యము కూడా ప్రవేశించినది. అలక్ష్యంతోపాటు అసభ్యతగూడా వచ్చిచేరుకొన్నది. వైశంపాయనుడు ఇవన్నీ గుర్తిస్తూవచ్చాడు.

ఆనాటి గురువులు మంచికి శిష్యులకు ప్రాణములైనా ఇచ్చేవారు. దారితప్పి నడవటం, అవినయంగా ప్రవర్తించడం, అశ్రద్ధతో చరించటం ఇటువంటి దుర్లక్షణములు కలిగినవారిని చాలాకఠినంగా దండించేవారు. శిక్ష అనగా విద్య. కేవలము పుస్తకాలు చదువుటకాదు విద్య. గురువు ఆజ్ఞను శిరసావహించి, గురువు ఆజ్ఞాపించిన సూత్రములన్నింటినీ మనసారా స్వీకరించడమే నిజమైన విద్య. ఇవన్నీ గుర్తించిన వైశంపాయనుడు ఒకనాడు యాజ్ఞవల్క్యుని దగ్గరకు పిలిచి, "యాజ్ఞవల్క్యా! నీవు ఈ గురుకులములో చదువుటకు అర్హుడవుకాదు. తక్షణమే దీనిని విడిచి నీవు వెళ్ళిపోవలసినది. నీవు వెళ్ళిపోవుటయేకాదు, నేను ఇచ్చిన విద్యలన్నీ వెనుకకు తిరిగి ఇచ్చి వెళ్ళిపోవాలి" అన్నాడు. ఎంత ప్రేమతో విద్యలను శిష్యునికి తాను అందించినాడో, అంతకఠినమైన వాక్కులతో ఆ విద్యలన్నిటినీ తిరిగి వెనుకకు తీసుకొన్నాడు. తన అపరాధమును గుర్తించిన యాజ్ఞవల్క్యుడు తాను నేర్చిన విద్యలన్నింటిని వమనం చేసినాడు. ఆ వమనమును "తిత్తిరి పక్షులు" భుజించినాయి. ఆ పక్షులు ఈ వేదమును ఉచ్చరించుట ప్రారంభించినాయి. తిత్తిరి పక్షుల నుండి వచ్చిన శబ్దములు కనుకనే దీనికి "తైత్తిరీయ సంహిత" అని పేరు.

## బ్రహ్మసాంప్రదాయం, ఆదిత్యసాంప్రదాయం

వేదమునకు రెండు విధములైన సంప్రదాయములు ఉంటున్నాయి. ఒకటి బ్రహ్మసంప్రదాయము, రెండవది ఆదిత్యసంప్రదాయము. యాజ్ఞవల్క్యుడు వమనము చేసిన దానికి బ్రహ్మసంప్రదాయము అని పేరు వచ్చింది. దీనినే "కృష్ణయజుర్వేదము" అని అన్నారు.

యాజ్ఞవల్క్యుడు తన దోషాన్ని తాను గుర్తించి గురువుగారి ఆజ్ఞను ఉల్లంఘించిన తప్పుచేత ఆహారపానీయములు మాని కఠినమైన సూర్యోపాసన సలుపుతూ వచ్చాడు. పశ్చాత్తాపమే ప్రాయశ్చిత్తమని ఈ విధమైన ప్రాయశ్చిత్తాన్ని అనుభవిస్తూ వచ్చాడు. తరువాత సూర్యుడు ప్రత్యక్షమై 'వాజి' రూపమును ధరించి, "నాయనా! గడచినదేదో గడిచిపోయింది. తిరిగి నీవు ఇట్టి దోషమును ఆచరించరాదు. 'గురుద్రోహం దైవద్రోహం' మహాప్రమాదం. నీవు జాగ్రత్తగా ఉండుము" అని తిరిగి వేదములను సూర్యుడే ఉపదేశించాడు. వాజిరూపంలో సూర్యుడు ఎందుకు ప్రత్యక్షమైనాడు? యాజ్ఞవల్క్యుని పూర్వీకులు నిరంతరం అన్నదానం చేసేవారు. కనుకనే ఆ కుటుంబమునకు "వాజసం" అని పేరు వచ్చింది.

"వాజసం" అనే పేరు రావడం చేతనే వాజి స్వరూపాన్ని ధరించి, ఈతనికి వేదోపదేశంచేసినాడు. దీనికే "శుక్లయజుర్వేదము" అని పేరు వచ్చింది. "శుక్లయజుర్వేదము"నకే వాజసస్కందమని, ఆదిత్య ఖండమని పేర్లువచ్చినవి. సూర్యోపాసనచేత లభ్య

మైనది కనుకనే దీనికి "ఆదిత్యస్కందము" అని, వాజసరూపములో ప్రత్యక్షమై బోధించుటచేత ఇది వాజసస్కందమని ఈ విధముగా ఒక్కొక్క రూపమును ధరిస్తూ వచ్చింది. యజుర్వేదము రెండుగా విభజింపబడినది.

ఆనాడు సూర్యోపాసనచేత సూర్యుని అనుగ్రహాన్నిపొంది, ఏది ఈ లోకమునకు ప్రధానమైనది? అని విమర్శించుకొని, విచారించుకొని, అన్ని విధములుగా పరిశీలనసల్పి, దేశానికి, సామాన్య మానవులకు యాజ్ఞవల్క్యుడు కర్తవ్య, కర్మలను బోధిస్తూ వచ్చాడు. "ఆనాడు నా కుటుంబీకులు అన్నదానము సల్పుటచేతనే కదా! ఈనాడు సూర్యుడు వాజసరూపమును ధరించివచ్చాడు" అనుకొనినాడు. కనుకనే ఆనాటి నుండి తల్లిదండ్రులసేవ, గురుసేవ, అన్నదానము ప్రధాన విషయములుగా గుర్తించుకొని యాజ్ఞవల్క్యుడు తన శిష్యులకు బోధిస్తూవచ్చాడు.

## శ్రీవారి సందేశం

విద్యార్థులారా!

వేసవితరగతులు ఏకాదశి దినమున ప్రారంభమైనవి. తిరిగి ఏకాదశి దినముతో ఈ తరగతులను పరిపూర్ణము గావిస్తున్నాము. ఈ క్లాసులన్నీ ఏకాదశి వ్రతముగా మనము భావించాలి. ఈ వ్రతములయందు అనేకమంది పెద్దలు, అనుభవజ్ఞులు హృదయపూర్వకముగా మీకు అనేక విషయములను బోధిస్తూవచ్చారు. వారందరూ మీకు అంత సులభంగా చిక్కేవారు కారు. స్వామియైనా మీకు సులభంగా చిక్కినాడుకానీ, వారెవ్వరూ మీకు చిక్కరు. అలాంటివారు వచ్చి, ఎంతో భక్తిశ్రద్ధలతో, హృదయపూర్వకమైన ప్రేమతో మీకు అనేక విషయములను బోధిస్తూవచ్చారు. మీరు చాలా భక్తిశ్రద్ధలతో వారు తెలిపిన విషయాలను స్వీకరించినారు. కేవలము స్వీకరించుట మాత్రము చాలదు. స్వీకరించినవి ఆచరించాలి. గురువుల ఆజ్ఞకాని, తల్లిదండ్రుల ఆజ్ఞకాని, పెద్దల ఆజ్ఞకాని మీరు అలక్ష్యము చేయకూడదు. అవినయముగా మెలగరాదు. వినయ విధేయులై మీరు విద్యలు స్వీకరించాలి. ఈ పదహైదు దినములు బోధించినవి పవిత్రమైన వేదాంత సారము. సకలశాస్త్ర, పురాణ, ఇతిహాసముల ప్రమాణములను మథించి, అందించిన సుధానిధి. ప్రతి విద్యార్థి సత్కర్మలలో ప్రవేశించాలి. సత్కర్మలు ఆచరించినప్పుడే చిత్తశుద్ధి కలుగుతుంది. చిత్తశుద్ధి కలిగినప్పుడే జ్ఞానసిద్ధి లభ్యమౌతుంది.

విద్యార్థులారా! మీరు సమయము చిక్కినప్పుడు, "శ్రవణం, కీర్తనం, విష్ణోఃస్మరణం, పాదసేవనం, అర్చనం, వందనం, దాస్యం, సఖ్యమాత్మనివేదనం"— ఈ నవవిధ మార్గములలో ఏఒక్క మార్గాన్ని అనుసరించినా చాలు. భగవంతుడు నీ ధన, కనక, వస్తువాహనాదులు లేక నీ విద్యాసంపత్తులు ఏమీ చూడడు. కుల గోత్రములను విచారించడు. ఎవరు హృదయపూరితమైన ప్రేమతో తన్ను ఆశిస్తారో— "వారికి సన్నిధియై, పెన్నిధియై ఉంటాడు". వాల్మీకి, కుచేలుడు, ధ్రువుడు, ప్రహ్లాదుడు మున్నగువారు ఇందులకు తార్కాణం. శబరికి ఏ శక్తీ లేదు. కందమూలాదులు భుజించి చెట్లమొదల కూర్చుని, ఋషులు బోధించే విషయాలను ఏకాగ్రతతో విన్న వ్యక్తి శబరి. ఏ కర్మలను ఆచరించినా, భగవత్ ప్రీత్యర్థమనే భావనతో ఆచరిస్తూ వచ్చింది. శబరిచేసిన సర్వకర్మలు తపస్సుగా మారిపోయినాయి. ధ్యానము

అంటే, కన్నులు మూసుకొని డొక్కలుకొట్టుకొంటూ ఏదోఫోటోకోసం కూర్చున్నట్లుగా కూర్చోవడంకాదు. ఏ పనిచేసినా భగవత్ ధ్యానంగానే ఉంటుండాలి. ఈ విధముగా మనం చేసేపనులన్నీ భగవంతునికోసం చేస్తున్నామనుకొన్నప్పుడు, చెడ్డ పనులు మనము ఏమాత్రమూ చేయలేము. ఈ పవిత్రమైన సూత్రము లను మీ నేత్రములందుంచుకొని, శ్రోత్రముల ద్వారా విన్న విషయములను హస్తము ద్వారా ఆచరించి, పవిత్ర హృదయాలుగా రూపొంది, భావి భారతోద్ధార కులుగా రాణిస్తారని నేను ఆశిస్తూ, ఆశీర్వదిస్తూ నా ప్రసంగాన్ని విరమిస్తున్నాను.

శ్రీవారి దివ్యబోధ

3—జూన్—1990

బృందావనం.



# ప్రసన్నసాయి

శ్రీకరుణారసంబు సెలచిందెడి కన్గవవాఁడు- సత్యమే వాకొనువాఁడు, వేదముల పారమెఱింగినవాఁడు-
దివ్య "ర
త్నాకర"వంశవార్నిధి సుధాకరుఁడై విలసిల్లువాఁడు-తత్ప్రాకట సత్యసాయి భగవానుఁడు మాకు ప్రసన్నుడ
య్యెడిన్.

పర్తి వసించువాఁడు, సమవర్తి జయించినవాఁడు-
లోకముల్
కీర్తి నినించువాఁడు, హరికీర్తనలన్ వినిపించువాఁడు-భక్తార్తిని ద్రుంచువాఁడు, కరుణాళుఁడు నాబడు సత్య
సాయిః త
న్మూర్తి నిమాపుగాక ! కనుమోడ్చినయప్పుడు విప్పి
నప్పుడున్.

ఆతఁడే సత్యసాయి - పరాత్పరుండు
పర్తి సంవాసి - " ఈశ్వరాంబాసుతుండు "
ధర్మమభ్యుద్ధరింపగా - ధరణియందు
అవతరించిన - సకల భక్తావనుండు.

—వీరుభొట్ల సూర్యనారాయణ

తాడేపల్లిగూడెం (ప. గో. జి.)

# ప్రత్యక్షదైవం

ప్రతి కొండపై నీవె; ప్రతి గుండెలో నీవె
ప్రత్యక్షమైనిల్చు ప్రభుడవంట
ప్రతి పువ్వులో నీవె; ప్రతి నవ్వులో నీవె
స్నిగ్ధత్వమును నింప చేరుదంట
ప్రతి ఇంటిలో నీవె; ప్రతి కంటిలో నీవె
మార్గమ్ము చూపుచు మసలుదంట
ప్రతి వేణువున నీవె; ప్రతి బాణిలో నీవె
స్వరరూపమందుచు సాగుదంట

అణువునణువున సూక్ష్మమై యమరుదంట
ఆకసమ్మంటు ఘనరూప మందుదంట
ఇన్ని ప్రాణుల నీవె యాడింతువంట
సచ్చిదానందమయమూర్తి, సత్యసాయి.

—తూర్లపాటి రాధాకృష్ణమూర్తి,

గుంటూరు.

# సాయి పంచకం

హరివో! శంభుడవో! ప్రజాపతివొ! అల్లావౌదువో! క్రీస్తుగా
ధరజన్మించినవాడవో! ఎరుగ నీ తత్త్వంబు, సాక్షాద్దయా
శరధింగా వినుతింతునెప్పుడు, మనస్తాపంబులందీర్చుమో!
దురితోన్మూల మహత్త్వ సత్యపథ నిత్యోల్లాసి! సాయిప్రభూ!

అభిజాత్యంబు, లహంకృతుల్, కుటిల వాగాడంబరంబుల్, సదా
విభవాలింగిత దుష్టవర్తనలు, నిర్వీర్య ప్రసంగాలు - ని
త్యభయాందోళనలున్, జనప్రళయ సంధానములైసాగె- నీ
శుభనామంబిక దిక్కు మాకు నెపుడుఀ శోభిల్లగా మానవుల్.

ఏదోశక్తి దిగంతరాళములలో, నింపొంది, సర్వ ప్రజా
మోదంబిచ్చినమాడ్కి - నీ ఎడదలో మ్రోగించునోంకారవా
ణీ దివ్య ప్రభనిండె నార్షగుణ సందీప్తంబుగా ధాత్రి - స
త్యౌదార్యంబుల ప్రోవు నీవగుటకాదా! సత్యసాయి ప్రభూ!

శాంతికి తావలమ్మయిన, సత్యపథమ్మును జూపి, నిత్య సం
క్రాంతులు వెల్గజేయుచు జగమ్మున - నిర్మల భక్తిమార్గ సి
ద్ధాంతము దెల్పు నీ హృదయ ధామమునందున, దివ్యభావ రూ
పాంతర దీప్తులల్లుకొనె- వాకొననేర్తునె? నీదు లీలలఀ

మానవజాతికీ కరణి, మానితమార్గము జూపుచున్న; ని
గ్గానవివాడు- సత్యమును గానవివాడు- దురూహజిక్కు న
జ్ఞానిగనెంతు లోకమున- కామితముల్ సమకూర్చు నీ కళా
నూన విశేషముల్ దలతు నుల్లమునందున నెప్డు సాయిజీ!

—షేక్ అలీ, మార్టూరు (ప్రకాశం జిల్లా)